

# మామయ్య

తెలుగు బాలల మాసపత్రిక

సంపుటి: 2 సంచిక: 3-4, హైదరాబాద్, మార్చి-ఏప్రిల్ 2008
పేజీలు: 52 వెల: రూ.10/-



## ఉగాది శుభాకాంక్షలు

ఉగాది మన ఆకాంక్షల యుగాది



అరిబండి బాలసాహిత్యం ట్రస్టు

## మానవ అభివృద్ధిలో మైలురాళ్ళు- పురాతన రాతల బొమ్మలు

1,2 & 4 . బంక మన్ను టాబ్లెట్స్ పై రాతలు. 3. బంక మన్ను టాబ్లెట్స్‌పై రాసే స్టైలస్ పెన్నులు

5. ఈజిప్టు రాజుల కాలంలో రాచముద్రికలు (బంక మన్నుతో చేసినవి) .

6. గోడలపై పురాతన రాతలు, బొమ్మలు. 7. కంచుపై పురాతన రాతలు

8. తాబేలు డొప్పపై పురాతన చైనా రాతలు

4



1





2

3

8





5





7



6








సంపుటి : 2 మార్చి-ఏప్రిల్ 2008 సంచిక : 3,4






**చిరునామా**

ఎడిటర్, **మామయ్య** బాలల మాసపత్రిక,
ఇం.నెం. 1-1-187/1/2, వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్: 040-27620887, ఫ్యాక్స్: 040-27620887
సెల్ : 94900 98903

mamayya_bs@yahoo.co.in,
**Website:** www.balasahityam.org



సంపాదకీయం

# బాలలు - వేసవి సెలవులు

ఎంతో ఓర్పుతో, దీక్షతో పూర్తి చేసిన పరీక్షల తరువాత సెలవు వస్తే కలిగే ఆనందమే వేరు. ఇక దీర్ఘకాలం కొనసాగే వేసవి సెలవులు వస్తే కలిగే ఆనందాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. సెలవుల్లో స్నేహితులు, కబుర్లు, ఆటలు, పాటలు, ఆనందమే ఆనందం. ఏదో పేరుతో బాలలు బయటికి వెళ్ళి ఆడుకోవడానికే ప్రాధాన్యతనిస్తారు. కాని వేసవి ఎండలో వచ్చే సమస్యలు వారి స్వేచ్ఛకు అడ్డుగా వస్తాయి. ఎండల సమయంలో బయటికి వెళ్ళొద్దని, ఇంట్లోనే ఉండి ఆడుకోవాలనే ఆంక్షలు పెద్దలు పెడతారు. ఫలితంగా పిల్లలు టి.వి. కాల క్షేపానికి పరిమితం అవుతారు. లేదా స్నేహితులతో కాలక్షేపం కబుర్లతో గడపడానికి ప్రయత్నం చేస్తారు. ఈ రెండూ మంచివి కావు. సెలవుల సమయం సద్వినియోగానికి ఇవి దోహద పడవు. అందువల్ల ఒక పద్ధతి ప్రకారం బాలలకు సెలవుల కాలంలో వినోదం, విజ్ఞానం కలిగించడానికి ప్రయత్నం చేయాలి. తద్వారా వారి వ్యక్తిత్వ వికాసానికి దోహద పడాలి.

నేర్చుకొనే ప్రక్రియ నిరంతరం కొనసాగే ప్రక్రియ. ప్రకృతి వాతావరణంలో, సహజ సిద్ధంగా బాలలు వేగంగా, సమర్థవంతంగా నేర్చుకుంటారు. ఇది వారి వ్యక్తిత్వ వికాసానికి బాగా తోడ్పడుతుంది. అందువల్ల సెలవుల కాలంలో వీలును బట్టి బాలల్ని నేరుగా బయటికి తీసుకెళ్ళి అటవీ ప్రాంతానికో లేదా కనీసం జూ, పార్కులకు, బంధువులు, మిత్రుల ఇళ్ళకు తీసుకొని వెళ్ళి చూపించాలి. ఇలా బయటికి తీసుకెళ్ళినప్పుడు వేసవి కాలం ఎండల నుండి తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

పెద్దలు పిల్లలతో సాధ్యమైనంత ఎక్కువ సమయం గడుపుతూ, ఎండల సమయంలో కథల పుస్తకాలు చదవాలి. లేదా చదివించాలి. పాటలు పాడుతూ, పాడించాలి. బొమ్మలు వేయడం, బొమ్మలు చేయటం నేర్పితే ఇవి పిల్లలకు ఎంతో సంతోషాన్ని కలిగిస్తుంది. దీనికై అవసరమైన పుస్తకాలను, సామగ్రిని సేకరించి పిల్లలకు ఇవ్వాలి.

చదువులోని పిల్లల బలహీనతలను గమనంలో ఉంచుకొని వేసవి సెలవుల్లో వీటిని అధిగమించడానికి ప్రత్యేక కృషికై ప్రతి రోజు బాలలు ఎంతో కొంత సమయం కేటాయించేలా చూడాలి. ఉదాహరణకు ఏదైనా ఒక సబ్జెక్టులో లేదా రాయడంలో బలహీనంగా ఉంటే దానిలో ఈ కృషి చేయించవచ్చు. ఇది పిల్లల భవిష్యత్‌కు ఎంతో దోహద పడుతుంది.

ప్రతి రోజు సాయంత్రం శారీరక శ్రమ కలిగే ఆటలకు కొంత సమయం కేటాయించి ఆడేలా చూడాలి. పెద్దలు కూడా పిల్లలతో ఎంతో కొంత సమయం తప్పని సరిగా ఆడాలి. ఈ విధంగా జాగ్రత్తలు తీసుకుంటే పిల్లలకు వేసవి సెలవుల్లో వినోదం, విజ్ఞానంతో పాటు వారి ఆరోగ్యకర పెరుగుదలకు దోహద పడిన వారం అవుతాం.



# పిల్లల పెంపకంలో వేసవి జాగ్రత్తలు



- డా॥ ఎ. మనోహర్

సెలవులు అనగానే పిల్లలకు ఒకే హుషారు. దీర్ఘకాలం వచ్చే వేసవి సెలవుల గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. పరీక్షలయిపోతాయి. బడి, చదువు, హోంవర్కుల బాధ ఉండదు. ఇక స్నేహితులు, కబుర్లు, కేరింతలు, పరుగులు, ఆటలే ఆటలు. చుట్టాలు లేదా స్నేహితుల ఇంటికి బస్సు లేదా రైళ్ళ ప్రయాణం. అన్నీ సరదాలే. ఇక పిల్లలు ఎండను, వేడిని ఎందుకు లెక్క చేస్తారు? ఈ సమయంలో ఏ కొద్దిగా అజాగ్రత్త వహించినా 'వడదెబ్బ' కొట్టడం ఖాయం. ఫలితంగా నీరసం, వడిలి పోయినట్లు అగుపడడం, తలనొప్పి, జ్వరం తప్పనిసరిగా వచ్చే పరిస్థితి. సరదాగా పెట్టుకున్న ప్రయాణంవల్లా పిల్లల జ్వరంతో ఆందోళన కలిగించే దుస్థితి. ముందు, వెనుక్కు పోలేని దుస్థితిగా మారుతుంది. డాక్టర్, మందుల ఖర్చులు. మొత్తం మీద, సరదాగా గడపాల్సిన సమయంలో ఆందోళన. అనుకోని ఖర్చులు. పిల్లల పెంపకంలో ఈ దుస్థితి రాకుండా తగు జాగ్రత్తలు తీసుకొని తప్పించుకోవచ్చు.

### వేసవి జాగ్రత్తలు

**1.** బాగా ఎండ గొట్టే సమయంలో, ముఖ్యంగా ఉదయం 10 సాయంత్రం 5 గంటల మధ్య, పిల్లలు నీడలోనే (ముఖ్యంగా ఇంట్లో) ఆడుకొనేటట్లు జాగ్రత్తలు తీసుకోవాలి. ప్రయాణించాల్సి వస్తే, ఈ



సమయంలో ప్రయాణం లేకుండా చూసుకోవాలి.

**2.** వేడి నుండి రక్షణకై తేలిక పాటి రంగులు గల పలచని, వదులైన బట్టలనే తొడగాలి. ముదురు రంగు బట్టలను వేయకూడదు. వేసవిలో వేడి నుండి రక్షణ కలిగించేందుకు నూలు బట్టలనే తొడగాలి.

**3.** బయటికి పోయినప్పుడు తలకు రక్షణకై టోపిని పెట్టుకొనేలా చూడాలి. కళ్ళ రక్షణకై 'సన్ గ్లాసులను' ధరింప చేయాలి.

**4.** వేసవిలో మనకు తెలియకుండానే శరీరం నీటిని కోల్పోతుంది. అందువల్ల మంచి నీటిని, ఇతర పానీయాలను తరుచుగా, అధికంగా (పెద్ద పరిమాణంలో) తాగించాలి. మజ్జిగ, నిమ్మరసం (ఉప్పు, పంచదార కలిపినది), పండ్ల రసం, కొబ్బరి నీళ్ళు, వీలునుబట్టి ఏది ఉంటే అది సరిపోయేంత తాగించాలి. అంటే కనీసం గంట కోసారి తాపించాలి. కాఫీ, టీ, కెఫీన్ కలిగి ఉండే పానీయం, కోకాకోలా లాంటి పానీయాలను తాగించకూడదు.



**5.** బయట ఆడే ఆటల కాలాన్ని సాధ్యమైనంత మేర తగ్గించాలి. తరుచుగా పైన తెలిపిన పానీయాలను తాపించాలి. బాగా శ్రమ కలిగించే ఆటలు ఆడే ముందు మంచి నీటిని, నిమ్మ రసాన్ని, ఇతర పానీయాలను ఏదో ఒక దానిని తాగించాలి. ఆడేటప్పుడు మధ్య మధ్య దప్పిక లేకపోయినప్పటికి పై పానీయాలను మారుస్తూ తాగించాలి.

**6.** ఈదే సమయంలో పిల్లలను ఎప్పుడు ఒంటరిగా ఈదనీయకూడదు. ఎవరో ఒక పెద్ద తప్పని సరిగా ఉండి పర్యవేక్షిస్తుండాలి.

**7.** ఎవరైనా వేడికి వడలి పోయినట్లు లేక బాగా అలసి పోయినట్లు లేదా వడదెబ్బ చిహ్నాలు అగుపడితే పైన సూచించిన ద్రవాలను మారుస్తూ ఎక్కువగా తాపించాలి. ముఖ్యంగా నిమ్మరసం (ఉప్పు, పంచదార కలిపింది) త్వరగా కోలుకోనేందుకు సహాయ పడుతుంది. కొబ్బరి నీళ్ళు లేదా పండ్ల రసం తాపిస్తే త్వరగా శక్తితో కోలుకుంటారు.

**8.** వడదెబ్బ బాగా తగిలినప్పుడు స్పృహ కోల్పోవచ్చు. లేదా పూర్తిగా అలసిపోయి సరిగ్గా మాట్లాడలేని స్థితిలో పడిపోవచ్చు. వెంటనే బట్టలు ఊడదీసి తడి గుడ్డతో వొళ్ళంతా తుడవాలి. పలచటి వదులైన బట్టలను తొడగాలి. ద్రవ పదార్థం తీసుకొనే స్థితిలో ఉంటే వెంటనే నిమ్మరసం (ఉప్పు, పంచదార కలిపింది) తాపించాలి. కొంతసేపటికి కొబ్బరి నీటిని లేదా పండ్ల రసాలను మారుస్తూ తాపించవచ్చు. ఆ తరువాత వెంటనే డాక్టరుకు చూపించాలి. స్పృహ తప్పితే మాత్రం వెంటనే డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళాలి. 



# టి.వి. దుష్ప్రభావాల నుండి బాలల్ని కాపాడాలి



**బా**లలకు టి.వి. పై ఉన్న ఆకర్షణను ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. అందువల్ల పెద్దలు ఎంత వద్దంటున్నా పిల్లలు టి.వి. కార్యక్రమాలను చూడడానికే ఉత్సాహం చూపుతారు. ఈ ఉత్సాహమే అలవాటుగా మారుతుంది. ఆ తరువాత వ్యసనంగా మారుతుంది. ఈ వ్యసనానికి బానిసలు కాకమునుపే పిల్లల్ని టి.వి. నుండి మనం రక్షించుకోవాలి. ఈ సమయంలో టి.వి.ని చూడకుండా పిల్లల్ని పూర్తిగా ఆపలేము. ఇలా ఆపడం కూడా మంచిది కాదు.

### టి.వి. దుష్ప్రభావం

టి.వి. అత్యంత శక్తివంతమైన సాధనం. వినోదాన్ని, విజ్ఞానాన్ని కలిపి ఒకేసారి అందించగలిగే శక్తి దీనికి ఉంది. సమాజ వికాసానికి ఉపయోగపడాల్సిన ఈ సాధనం దురదృష్టంగా ఇప్పుడు స్వార్థపర వాణిజ్య శక్తుల గుప్పిట్లో బందీగా ఉంది. అందువల్ల మొత్తం సమాజ వికాసానికి కాక కొన్ని వర్గాల వారికే ప్రయోజనాలను సమకూర్చే సాధనగా టి.వి. మారింది. చివరకు, ప్రత్యేకంగా బాలలకే ఉద్దేశించిన కార్యక్రమాల్లో కూడా వ్యాపార వర్గాల ప్రయోజనాలే అత్యధికంగా అగుపడుతున్నాయి. ఆధిపత్య వర్గ విలువలనే పెంపొందిస్తున్నాయి. బాలల వికాసానికి, తోడ్పడటంలేదు. విస్తృత సమాజ ప్రయోజనాలను పెంపొందించటంలేదు.

టి.వి. కార్యక్రమాలను 'వాస్తవాల' ఆధారంగా రూపొందించడంలేదు. వినోదం పేరుతో అర్ధసత్యాలను, అసత్యాలను కలిపి మొత్తం మీద అవాస్తవ ప్రపంచాన్నే టి.వి.లో చూపెడుతున్నారు. టి.వి. కార్యక్రమాలలోని నిజనిజాలకు టి.వి. సంస్థలు ఏ బాధ్యత తీసుకోవడంలేదు.

ముఖ్యంగా పిల్లల కార్యక్రమాలలో పై ధోరణి మితిమీరి అగుపడుతుంది. ఈ కార్యక్రమాల్లో ఉన్న వినోదానికి పిల్లలు ఆకర్షింపబడి, ఆటల్లో, పాటల్లో, చివరకు చదువులో ఆసక్తి చూపడంలేదు. ఫలితంగా, టి.వి.కే అతుక్కుపోయిన బాలలు ఆటలు,

పాటలు, చదువు నేర్చుకోవటంలో వెనుక బడుతున్నారు. భౌతిక మానసిక పెరుగుదలలో కూడా వెనుకబడుతున్నారు.

పిల్లలు టి.వి. కార్యక్రమాలను చూడకుండా కొద్దిసేపైనా నివారించాలని టి.వి.ని ఆపుచేస్తే వచ్చే ఏడుపులు, గోల దాదాపు అన్ని ఇళ్ళల్లో తరుచుగా జరిగే తతంగమే. ఫలితంగా, పిల్లల భౌతిక మానసిక పెరుగుదల కుచించుకపోతుంది. టి.వి.లో వచ్చే వాణిజ్య ప్రకటనలకు ఆకర్శించబడి టి.వి. చూసేటప్పుడు పనికి రాని చిరుతిండ్లను (జెంక్ ఫుడ్స్) పిల్లలు తింటున్నారు. ఫలితంగా 'ఊబకాయులు'గా మారి ఆరోగ్యాన్ని పాడు చేసు కుంటున్నారు. ఈ నేపథ్యంలో, పెరుగుతున్న బాలల్ని టి.వి. దుష్ప్రభావాల నుండి కాపాడు కోవాల్సిన అవసరం ఎంతో ఉంది. దీనికై ఇంట్లోని పెద్దలు కూడా టి.వి. కార్య క్రమాలను చూడటంలో 'స్వయం నియంత్రణ' పాటించాలి.



**తీసుకోవాల్సిన జాగ్రత్తలు**

1. బాలల్ని టి.వి కార్యక్రమాలను ఒంటరిగా ఎట్టి పరిస్థితుల్లోను చూడనివ్వకూడదు. ఇది చాలా ముఖ్యం. పిల్లలు టి.వి. చూసేటప్పుడు ఇంట్లోని పెద్దలు ఎవరో ఒకరు తప్పని సరిగా ఉండాలి. చూసే టి.వి. కార్యక్రమాల మంచి చెడ్డలను కార్యక్రమం తరువాత తప్పని సరిగా పిల్లలకు వివరించి చెప్పాలి. వారు అడిగే ప్రశ్నలకు 'సమాధానాలు' కూడా చెప్పాలి. అప్పుడే బాలలు టి.వి. కార్యక్రమాల్లోని వాస్తవాల్ని, అవాస్తవాల్ని అర్థం చేసుకొని తమ అనుభవాలకు అన్వయించుకోగలరు.

2. ఎట్టి పరిస్థితులోను పెద్దలకు తీరక లేదనే పేరుతో పిల్లలను టి.వి.కి వదిలేసి కార్యక్రమాలను చూడనీయకూడదు. అంటే, టి.వి.ని 'బేబీ సిట్టర్'గా వాడకూడదు.

3. ఏదో ఒక నిర్దేశించిన సమయంలోనే ఎంపిక చేసిన కార్యక్రమాలను మాత్రమే పిల్లలను టి.వి.లో చూడనివ్వాలి. ఉదాహరణకు అన్నం తినే సమయంలో. హోం వర్క్ సమయంలో. ఆడుకునే సమయంలో టి.వి.ని ఆపుచేయాలి.

4. పెద్దలు కూడా టి.వి.ని ఎప్పుడు బడితే అప్పుడు పెట్టుకోకూడదు. సాధ్యమైనంత వరకు పిల్లలు ఇంట్లో లేని సమయంలో, టి.వి.ని చూడాలి. పిల్లలు ఇంట్లో ఉన్నప్పుడు కథలు చెప్పాలి. పాటలు కలిసి పాడాలి లేదా పాడించాలి. పుస్తకాలు చదివేలా చూడాలి. సెలవుల్లో పిల్లలను పార్కులకు, ఆటలకు తీసుకెళ్ళాలి. బొమ్మల్ని వేయటం, బొమ్మలు తయారు చేయించడం లాంటి అలవాట్లను నేర్పి, ప్రోత్సహించాలి.

ఈ నియమాలను ఖచ్చితంగా పాటించడాన్ని పిల్లలు మొదట అంత తేలికగా అంగీకరించరు. భయపెట్టే విధంగా గాక ప్రేమతో, మాటల్లోకి దించి, టి.వి. మంచి చెడ్డలను చెబుతూ పై జాగ్రత్తలు తీసుకుంటే పిల్లలు సంతోషంగా పై నియమాలను ఒప్పుకుంటారు. పిల్లలకు నచ్చజెప్పేటప్పుడు పెద్దలందరూ ఒకే మాట మీద ఉండాలి. వారి ఎదుట వాదించుకోకూడదు. ఏమైన భేదాభిప్రాయాలుంటే పిల్లల ముందర బయట పెట్టుకోకూడదు. వేరే చర్చించుకొని ఏకాభిప్రాయానికి రావాలి. అప్పుడే పిల్లలు టి.వి. దుష్ప్రభావాలనుండి రక్షించబడి ఆరోగ్యంగా వికసించగలుగుతారు.



# ఉగాది పండుగ



కొత్త సంవత్సరం ప్రారంభ దినాన్ని తెలుగు వారు ఉగాది పండగగా చేసుకుంటున్నారు. యుగ + ఆది (అంటే యుగానికి మొదలు) ఉగాదిగా వ్యవహరించబడుతుంది. ఈ పండుగ వేసవి కాల ప్రారంభాన్ని కూడా సూచిస్తుంది. హిందువులందరూ చేసుకొనే పండుగలలో ఇది ముఖ్యమైన పండుగ.

అయితే, ఈ పండుగను అందరూ ఒకే రోజున చేసుకోవడంలేదు. ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్రలో చంద్రుని కదలికల ఆధారంగా (చాంద్రమానం ఆధారంగా) 'చైత్ర శుద్ధ పాడ్యమి' నాడు ఉగాది పండుగ చేసుకుంటున్నారు. ఇదే పండుగను సూర్యుని



కదలికల ఆధారంగా తమిళులు, మళయాళీలు, బెంగాలీలు, పంజాబీలు, అస్సామీలు వేరే రోజులలో చేసు కుంటున్నారు. గుజరాతీలు, మార్వాడీలు, బృహస్పతిమానాన్ని అనుసరించి ఈ పండుగను జరుపుకుంటున్నారు. 'గుడిపాడవ' పేరుతో మహారాష్ట్రలో, 'విషు' పేరుతో కేరళలో ఈ పండుగను జరుపుకుంటున్నారు.

ఈ పండుగ వసంత రుతువులో వస్తుంది. ఈ సమయంలో చెట్లన్నీ చిగుర్లతో పచ్చగా అందంగా ఉంటాయి. కోయిల పాటలతో, కొత్త పూల వాసనతో ప్రకృతి చూడడానికి అందంగా ఉంటుంది. చెరుకు, మామిడి, చింతపండు వంటి పంటలు చేతికి వస్తాయి.

ఉగాది పచ్చడిని తయారు చేసి తినడం ఈ పండగ ప్రత్యేకత. ఈ పచ్చడి షడ్రుచులు కలిగి ఉంటుంది. అంటే ఆరు రకాల రుచులు ఈ పచ్చడిలో ఉంటాయన్న



పంచాంగ శ్రవణం

మాట. కొత్త బెల్లం, చెరుకు ముక్కలు, పచ్చి మిరప, వేప పువ్వు, ఉప్పు, అరటి పండ్లను కలిపి ఈ పచ్చడిని తయారు చేస్తారు. మన జీవితంలో సుఖం, సంతోషం, దుఃఖం, ఆందోళనల కలియకలను ఈ పచ్చడి రుచి గుర్తు చేస్తుందని అందరూ భావిస్తున్నారు.

ఈ పండుగ మరో ప్రత్యేకత పంచాంగ శ్రవణం. అంటే, సంవత్సర ప్రారంభంలోనే పంచాంగం ద్వారా వచ్చే ఏడాది వర్షాలు, పంటల స్థితిగతులు, జన్మ నక్షత్రం ఆధారంగా వివిధ వ్యక్తులకు జరుగబోయే మంచి చెడ్డలను గురించి తెలుసుకుంటారు. దీనిని పురోహితులు అందరికి సౌకర్యంగా ఉండే చోట కూర్చొని చదువుతారు. దీనిని ఎక్కువ మంది వింటారు. ఇటీవల టి.వి.ల్లో కూడా పంచాంగ పఠనాన్ని చూపిస్తున్నారు. దీనిలో దేశ, రాష్ట్ర రాజకీయ పరిస్థితులలో రాబోయే మార్పులను కూడా అంచనా వేసి వ్యాఖ్యానాలను పంచాంగ పఠనంలో భాగంగా చూపెడుతున్నారు. చాలా మంది ఈ పంచాంగంలో ఊహించి చెప్పినట్లుగా జరుగుతుందని నమ్ముతున్నారు. కాని, అన్నీ పంచాంగంలో చెప్పినట్లు జరగవనేది అనుభవంలో తెలుస్తుంది.

గ్రామ ప్రాంతాలలో పండుగ సందర్భంలో కుస్తీ పోటీలు, పరుగు పందాలు, బల ప్రదర్శనలు, ఎడ్ల బండి పోటీలు వంటి వినోద కార్యక్రమాలను ఏర్పాటు చేస్తున్నారు. చాలా మంది ఈ రోజు దేవాలయాలకు వెళ్ళి తమకు సంవత్సరమంతా మంచి కలగాలని పూజలు చేస్తున్నారు.

కవి సమ్మేళనాలు ముఖ్యమైన సాంస్కృతిక కార్యక్రమంగా నిర్వహించడం తెలుగు వారి ప్రత్యేకత. రేడియో, టి.వి. ఛానళ్ళలో పంచాంగ పఠనం, కవి సమ్మేళనాలు ఉగాది పండుగ ప్రత్యేక కార్యక్రమాలుగా ప్రసారం చేస్తున్నారు.



# శ్రీరామ నవమి పండుగ


భద్రాచలం శ్రీరామాలయం

ఇది హిందువుల ఆధ్యాత్మిక పండుగ. శ్రీవిష్ణు భగవానుడి ఏడవ అవతారమైన శ్రీరాముడు పుట్టిన రోజు, చైత్ర మాసం నవమి నాడు ప్రతి సంవత్సరం ఈ పండుగను చేసుకుంటున్నారు. కొంత మంది 'వసంత నవరాత్రి' పండుగగా తొమ్మిది రోజులు ఈ పండుగను చేసుకుంటున్నారు. వివిధ సాంస్కృతిక కార్యక్రమాలతో ఈ రోజుల్లో సరదాగా గడుపుతారు.

బెల్లంతో చేసిన పానకాన్ని తాగడం, పంచడం ఈ పండుగ ప్రత్యేకత. వడ పప్పు (నాన్చిన పెసర పప్పు), బెల్లం, పచ్చి కొబ్బర, అరటి పండులతో కూడిన ఫలహారాన్ని పంచడం ఈ పండుగకు మరో ప్రత్యేకత.

మన రాష్ట్రంలో రామాలయాల్లోనే కాక వీధుల్లో కూడా పందిర్లు వేసి పూజలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. రామాయణ పారాయణం, హరికథలు, బాగవతం వృత్తాతంగా సామూహిక సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. అవసరమైన ఖర్చులను చందాల రూపంలో ప్రజల నుండి వసూలు చేస్తున్నారు. ఈ సందర్భంలో కొంత మంది భార్యా భర్తలు శ్రీరాముడు-సీతలకు ప్రతీకగా పీటలమీద కూర్చొని సరదాగా మళ్ళీ పెళ్ళి చేసుకుంటారు. ఇలా కూర్చున్నవారు పూజ సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణకు అయ్యే ఖర్చుకు విరాళ రూపంలో సామాన్యంగా ఇస్తారు.

భద్రాచలంలో రాముడు- సీతా కళ్యాణం ఈ రోజున ప్రతి సంవత్సరం చేయటం ఒక ఆచారంగా కొనసాగుతున్నది.


సీతా రామా కళ్యాణం

# మానవ అభివృద్ధిలో

# మైలురాళ్ళు..
# 5. రాయడం

- వికాస్

ఇప్పుడు రాయడం మన జీవితంలో ఒక భాగం. రాయలేని ఆధునిక మానవుణ్ణి ఊహలోనైనా చూడం. 'రాయడం' మానవ జీవితంలో ఎన్నో మార్పులను ప్రారంభించింది. అందుకనే 'రాయడం' అనే ప్రక్రియ మానవ అభివృద్ధిలో ఒక మైలు రాయిగా నిలిచిపోయింది. అయితే ఇప్పుడు మనం రాస్తున్న పద్ధతి రూపొందడానికి వేల సంవత్సరాలు పట్టింది.

ఆది మానవుడు తన మనస్సులో అనుకున్నది ఇతరులకు తన నోటి ద్వారా కొన్ని శబ్దాలు, సైగలు చేస్తూ మొదట తెలువడం ప్రారంభించారు. ఇలా ఆదిమానవులు తమ ఆలోచనలను, భావాలను ఒకరికొకరు తెలుపుకొనేవారు. ఒకరిని ఇంకొకరు అర్థం చేసుకొనేందుకు వాడిన ఈ శబ్దాలే మాటలుగా మారాయి. ఈ మాటలు ఒక్కో గుంపులో ఒక్కో విధంగా ఉండేవి. ఈ వేరు వేరు మాటల సమూహాలే వేరు వేరు భాషలుగా రూపొందాయి. ఇలా మనస్సులోని మాటలను ఒకరికొకరు ఎప్పుడూ ఎదురెదురుగా ఉంటూ చెప్పుకోవడం సాధ్యం కాదు. ఈ ఇబ్బందిని అధిగమించడానికే ఆది మానవుడు 'రాయడాన్ని' రూపొందించాడు. ఇప్పుడు మనం పెన్సిల్ లేదా పెన్నుతో కాగితం మీద రాస్తే దీన్ని చదివిన వారందరూ రాసిన వ్యక్తి మనస్సులోని విషయాల్ని తెలుసుకుంటున్నారు. ఇలా ప్రారంభమైన 'రాయడం' ఇప్పటి స్థాయికి ఎదగడానికి ఎన్నో వేల సంవత్సరాలు పట్టింది.

**రాయడం రూపొందిన తీరు**

మొదట రాయడం 'గుర్తు' లేదా 'బొమ్మ'ల రూపంలో ఉండేది. ఈ గుర్తులు లేదా బొమ్మలు నేడు మనం చూస్తున్న రాతలాగా లేకపోయినప్పటికి, నేటి రాత పోలికలు కలిగి ఉన్నాయి. ఇలాంటి రాతలను మొదట ఆదిమానవుడు నివసించిన గుహల్లో, గుహల గోడల మీద కనిపించాయి. రాళ్ళ మీద చెట్ల మొదళ్ళ మీదకూడా కనిపించాయి. ఇలాంటి రాతలను రెండవ కవరు పేజీలో చూడవచ్చును. ఇలా రాయడం దాదాపు క్రీస్తు పూర్వం 7 వేల సంవత్సరాల క్రితం ప్రారంభమైందట. క్రీస్తు పూర్వం 6 వేల సంవత్సరాల కాలం నాటి బొమ్మలు బంక మన్నుతో చేసిన 'ట్రిర్శియా' టాబ్లెట్ రూపంలో కనిపించాయి.

మెసపొటోమియా నాగరికత కాలంలో సుమేరియన్ జాతి క్రీస్తు పూర్వం 3 వేల సంవత్సరాల ముందు బంక మన్నుతో మెత్తటి 'టాబ్లెట్స్' రూపంలో చేసేవారట. దానిపై ఇప్పటి అంకుశం లాంటి 'స్టైల్స్'తో



మొదట అనుకున్న బొమ్మలను లేదా రాతలను చేసేవారట. తరువాత, దానిని ఎండబెట్టి కాల్చేవారు. దీని ద్వారా చెరిగిపోని శాశ్వత గుర్తులు బంక మన్ను టాబ్లెట్‌పై ఏర్పడేవి. ఆ తరువాత 2, 3 వందల సంవత్సరాల కాలంలో ఈ బొమ్మలే గుర్తులుగా రూపొందాయి. ఇలా తయారు చేసిన టాబ్లెటు, గుర్తులను రెండవ కవరు పేజీ బొమ్మల్లో చూడవచ్చును.

ఇలా ప్రతి భావాన్ని తెలుపడానికి ఒక బొమ్మను వేసే వారు. రెండు లేక అంతకన్న ఎక్కువ బొమ్మలను ఒకే దాని మీద వేసి క్లిష్టమైన అంశాన్ని కూడా రాసేవారట. ఇలా బొమ్మల రూపంలో నేడు మనం చూస్తున్న 'రాత' మొదట ప్రారంభమైంది.

రాత మొదట ప్రధానంగా ఆర్థిక అవసరాల కోసమే రూపొందించబడింది. సరుకులు వ్యాపారపు లెక్కలు, చేసిన పనిని లెక్కించడానికి శాశ్వతంగా బొమ్మలు కలిగిన బంక మన్ను టాబ్లెట్లను రూపొందించినట్లు చారిత్రిక ఆధారాలు తెలియజేస్తున్నాయి.

క్రీస్తు పూర్వం ఆరు వేల ఆరు వందల సంవత్సరాల కాలం నాటి చైనా గుర్తులు గల 'తాబేటి టెంకలు' దొరికాయి ఈ టెంకలపై బొమ్మలను వేశారు. వీనిని రెండవ కవరు పేజీ బొమ్మల్లో చూడవచ్చు.

ఈజిప్టు రాజుల కాలంలో రాజు అజ్ఞలను, అధికారానికి చిహ్నంగా రూపొందించబడ్డ టాబ్లెట్లను రెండవ కవరు పేజీలో చూడవచ్చు. మెసపొటోమియా నాగరికత కాలంలో ఇత్తడి రేకుల మీద 'రాయడం' ప్రారంభమైంది. ఇక మన దేశంలోని సింధూ నది ప్రాంతంలో 'హరప్పన్' నాగరికత మొదటి భాగంలో అంటే, క్రీస్తు పూర్వం దాదాపు 3 వేల సంవత్సరాల కాలంలో, రాయబడిన కొన్ని చిహ్నాలు దొరికాయి. అయితే వీని అర్థాన్ని ఇప్పటి వరకు శాస్త్రజ్ఞులు చెప్పలేక పోయారు.

ఖర్చు తగ్గించేందుకు, రాసిన దాన్ని సులభంగా ఒకచోటు నుండి ఇంకోచోటుకు మార్చడానికి వీలుగా ఈ రాత 'బంక మన్ను టాబ్లెట్స్' నుండి, లోహ రేకులకు, చెట్ల బెరడ్ల మీదికి, తాటి ఆకుల మీదికి, ఆ తరువాత పేపరు మీదికి మారింది. ఇదే సమయంలో పెన్ను, రాసేందుకు ఇంకులు కూడా రూపొందించబడ్డాయి. వీటన్నిటి ఫలితంగా సామాన్యులు కూడా రాయడం ప్రారంభించారు. వీనిని మనం చదివి విజ్ఞానాన్ని పొందుతున్నాం. పెద్ద అయిన తరువాత మీరు ఇంకెన్నో విషయాలను ఈ సందర్భంలో తెలుసుకోవచ్చు. 

## పొడవైన రెక్కల పక్షి ఆల్బట్రాస్

ఆల్బట్రాస్ అనే పక్షి ఎగిరే సముద్ర పక్షులలోకెల్లా అతి పెద్దది. ఇది పొడవైన రెక్కలతో ఒక్కసారి కదిలినంతనే చాలా దూరం ఎగరగలదు. ఇది ఎగిరేముందు విమానం లాగా చాలా దూరం వేగంగా పరుగెత్తి ఆ తరువాత గాలిలోకి ఎగురుతుంది. వీటి రెక్కలు 3.45 మీటర్ల పొడవుంటాయి. శరీరం 1.2 మీటర్ల పొడవుంటుంది.





# అందరిని గేలి చేసే రోజు

## (ఏప్రిల్ ఫూల్ రోజు)

ప్రతి సంవత్సరం ఏప్రిల్ 1వ తేదీన సరదాగా ఆటపట్టించేందుకు 'గేలి చేసే రోజు'గా పాటిస్తున్నారు. దాదాపు అన్ని దేశాలలో ఈ ఆచారం కొనసాగుతుంది. మన దేశంలో మాత్రం ఇది చదువుకున్న వారి మధ్య, అదీ తెలిసిన వారి మధ్య కొనసాగుతుంది. కాని, వాస్తవమేమిటో వెంటనే తెలియజేయాలి. లేకపోతే స్నేహితుల మధ్య, తెలిసిన వారి మధ్య అపోహలు కలిగే అవకాశం ఉంది.

ఇటీవల పేపర్లు, టి.వి.లు, రేడియోలలో కూడా హాస్యంగా ఈ దినాన్ని పాటిస్తున్నారు. కాని వెంటనే వాస్తవమేమిటో వివరిస్తున్నారు.

ఈ ప్రత్యేక దినాన్ని పండుగగా ఎన్నో దేశాలలో చేసుకుంటున్నారు. అయితే ఇది ఎలా ప్రారంభమైందో నిర్దిష్టంగా తెలియదు. చాలా పూర్వ కాలం నుండే సామాన్యులు మాత్రమే ఈ దినాన్ని పాటించే వారట. బాగా చదువుకున్న వారు, ధనవంతులు ఈ దినాన్ని పాటించకపోయే వారట. అందువల్ల ఈ దినం ఎప్పుడు ప్రారంభమైందో వివరించే ఆధారాలు లభించలేదు.



పురాతన రోమ్ సామ్రాజ్యంలో 'సాటర్‌నేలియాన్' అనే పేరుతో డిసెంబర్ చివరి రోజున ఈ పండుగను చేసుకునే వారట. తాగుతూ డాన్సులు చేస్తూ ఒకరినొకరు గేలి చేసుకొనేవారట. బహుమతులు ఇచ్చి పుచ్చుకొనే వారట. ఈ ఒక్క రోజు బానిసలకు తమ యజమానులపై పాలకులైనట్లు నటించే అవకాశం ఇచ్చేవారట.

బ్రిటన్‌లో ఉన్న ఒక జానపద కథ ప్రకారం 13వ శతాబ్ద కాలంలో రాజులు ఏ రోడ్డు లేదా స్థలంలోనైనా కాలు పెడితే, ఆ రోడ్డు లేదా స్థలం ఆ రాజుదే అవుతుందట. ఆ బ్రిటీష్ రాజ్యంలో నాటింగ్‌హామ్‌లోని గోతమ్ అనే గ్రామంలోని రోడ్డు మీద రాజు ప్రయాణం చేయాలను కున్నాడట. రాజు ఇలా ప్రయాణం చేస్తే గోతమ్‌లోని రోడ్డు ఆ రాజుకే



చెందుతుంది. ఇది తెలిసిన గోతమ్ నివాసులు దీనిని నివారించటానికి పిచ్చి పిచ్చిగా ప్రవర్తించారట. మొదట గోతమ్ గ్రామాన్ని చూడడానికి వచ్చిన రాజ సైనికులు గోతమ్ గ్రామంలో అందరూ పిచ్చివారని ఆ గ్రామాన్ని రాజు తీసుకోవడంవల్ల ఏమి ప్రయోజనం ఉండదని రాజుకు విన్నవించారట. అప్పుడు రాజు తన ప్రయాణాన్ని మానుకోవడంతో గోతమ్ గ్రామం రాజుకు చెందకుండా గ్రామ ప్రజలకే ఉందట. దీనికి గుర్తుగా ఆ గ్రామ ప్రజలు ప్రతి ఏప్రిల్ ఒకటిన తమ విజయాన్ని పిచ్చి పిచ్చిగా ప్రవర్తిస్తూ తాగుతూ నాట్యం చేస్తూ సరదాగా గడుపుకొనేవారట.

అయితే 4వ శతాబ్దం ప్రారంభాన్ని కల్లా ఈ పండుగ జనవరి ఫస్ట్‌కి మారిందట. ఈ పండుగ జనవరి ఫస్ట్ నుండి ఏప్రిల్ ఫస్ట్‌కు ఎలా మారిందో వివరించేందుకు ఓ చిన్న కథ కూడా ప్రచారంలో ఉంది. దీని ప్రకారం 16వ శతాబ్దం చివరి భాగంలో (1582లో) ఫ్రాన్స్ దేశం జ్యూలియస్ క్యాలెండర్ నుండి గ్రిగేరియన్ క్యాలెండర్‌కు మారిందట. ఈ కొత్త క్యాలెండర్ ప్రకారం జనవరి ఫస్ట్ నూతన సంవత్సరం మార్చి 23 నుండి ఏప్రిల్ ఫస్ట్ మధ్య కాలంలో వచ్చేదట. అయితే, క్యాలెండర్లో చేసిన ఈ మార్పును ఫ్రాన్స్ దేశస్తులందరూ పాటించకుండా పాత జ్యూలియర్స్ క్యాలెండర్ ఆధారంగానే జనవరి ఫస్ట్‌నే నూతన సంవత్సర దినంగా చేసుకొనేవారట. ఇలా కొత్త గ్రిగేరియన్ క్యాలెండర్‌ను పాటించకుండా పాత జ్యూలియస్ క్యాలెండర్ ప్రకారం నూతన సంవత్సర వేడుకలను చేసుకొనే వారిని 'గేలి' చేయడానికి ఏప్రిల్ ఫస్ట్‌న సరదాగా 'మూర్ఖులందరి దినం'గా చేసుకునే వారట. ఈ ఆచారం మొదట యూరోపులో, ఆ తరువాత ఇతర దేశాలకు విస్తరించి కొనసాగుతుంది. మన దేశంలో కూడా చాలా మంది చదువుకున్న వారి మధ్య సరదా కోసం ఒకరినొకరు అవాస్తవ వార్తలు, సంఘటనలు చెప్పి "ఏప్రిల్ ఫూల్" అని గేలి చేసుకుంటున్నారు.





# శ్రమ : 4. శ్రమ జీవితం

## శ్రమభారం - పనిముట్ల వాడకం

శ్రమే జీవితానికి మూలమని, శ్రమ లేకుండా జీవించలేమని తెలుసుకున్నాం. మనిషి జాతి ఆవిర్భావానికి, అభివృద్ధికి శ్రమే కీలకమని కూడా తెలుసుకున్నాం. ఇప్పుడు శ్రమ జీవితం ఎలా కొనసాగిందో తెలుసుకుందాం.

శ్రమించే సమయంలోనే శ్రమ భారాన్ని తెలుసుకుంటాం. కొన్ని పనులు చేయడం తేలిక అయితే మరికొన్ని పనులు చేయడం కష్టంతో కూడుకున్నదని మానవుడు తెలుసుకున్నాడు. ఉదాహరణకు చెట్ల కింద పడి వున్న పండ్లను సేకరించడం తేలిక. అదే చెట్ల మీద ఉన్న పండ్లను కోసి సేకరించడం అంత తేలిక కాదు. కష్టంతో కూడుకున్నది. మామిడి కాయలు, కొబ్బరి కాయలను సేకరించడంలో ఉన్న శ్రమను ఈ విధంగా



గమనించవచ్చు.

అంటే, అన్ని పనులను చేయడంలో 'ఒకే విధంగా కాక, పనిని బట్టి శ్రమ అవసరం' అవుతుంది. దీనినే ఇంకో విధంగా చెప్పాలంటే వివిధ పనులు చేయడానికి 'అవసరమైన శ్రమ' పని స్వభావాన్ని బట్టి, పని పరిమాణాన్ని బట్టి మారుతుంది. శ్రమ వినియోగించి తయారు చేసే వివిధ ఉత్పత్తుల విలువ ఇలా 'అవసరమైన శ్రమ' ఆధారంగానే నిర్ణయించబడుతుంది. ఈ వస్తువుల మార్కెట్ విలువ నిర్ణయించడంలో ఎన్నో ఇతర అంశాలు కూడా ఇమిడి ఉన్నాయి. వీనిని గురించి ముందు ముందు వివరంగా తెలుసుకుంటాం.

**శ్రమ భారం**

వివిధ పనులకు అవసరమైన శ్రమ వేరు వేరుగా ఉంటుందని తెలుసుకున్నాం కదా! కొన్ని పనులను చేయడం తేలిక అని ఇంకొన్ని పనులను చేయడం కష్టంతో కూడుకున్నదని తెలుసుకున్నాం. ఎంత తేలికైన పనినైనా, అదే పనిని మళ్ళీ మళ్ళీ చేయడం 'కష్టం'తో కూడుకున్నది. ఉదాహరణకు అమ్మ నాన్నలు ఇల్లు ఊడవటం లేదా బట్టలను మడత వేయడం చూసే ఉంటారు. ఇవి చాలా తేలికైన పనులుగా అగుపడతాయి. కాని ఈ పనులను రోజంతా చేయాలంటే భారంగా, కష్టమైన పనులుగా మారుతాయి. ఎపుడైనా రోడ్లు ఊడ్చే వారిని గమనించారా? లేకపోతే ఇపుడైనా గమనించండి. వీరితో మాట్లాడండి. రోడ్లను ఊడ్చటంలో వీరు పడే కష్టం మనకు అర్థం అవుతుంది. వీరిని మున్సిపల్ కార్మికులు అని పిలుస్తారు. వీరు రోడ్లు ఊడ్చి, చెత్త చెదారాన్ని ఎత్తివేయకపోతే, రోడ్లన్నీ దుమ్ము కొట్టుకొని, చెత్తచెదారం పేరుకుపోయి అసహ్యంగా మారుతాయి. ఫలితంగా, మనకు అంటు రోగాలు రావడం ఖాయం. దీనినే ఇంకో విధంగా చెప్పాలంటే 'అవసరమైన' పని కష్టమైనదైనా చేయక తప్పదు. దీనినే 'శ్రమభారం' లేదా 'పనిభారం' అంటాం.



**శ్రమభారం- పనిముట్ల వాడకం**

శ్రమ భారాన్ని తగ్గించడానికి మన పూర్వీకులు ఎన్నో పని ముట్లను రూపొందించారు. ఈ ప్రక్రియ కొనసాగుతూనే ఉన్నది. ఒక్కో పనికి ఒక్కో విధమైన పని ముట్లు రూపొందించబడ్డాయి. ఉదాహరణకు ఊడ్చే పని భారాన్ని తగ్గించడానికి వివిధ రకాలైన చీపుర్లు రూపొందించబడ్డాయి. ఇంట్లో ఊడ్చే చీపుర్లు, రోడ్లు ఊడ్చే చీపుర్లు వేరు వేరుగా ఉంటాయి. ఈ పనిముట్లే శ్రమ భారాన్ని తగ్గించి పనిని వేగంగా చేయడానికి తోడుపడతాయి. అంటే, 'పని సామర్థ్యాన్ని' ఈ పని ముట్లు పెంచుతాయన్న మాట. మొదట చేతితో వాడే పని ముట్లు రూపొందించబడ్డాయి. ఆయా పనులను బట్టి మన దేశంలో ఈ పని ముట్లను వాడుతున్నాం. అయితే యంత్రాలతో వాడే పని ముట్లు వచ్చి, పని భారాన్ని భాగా తగ్గించాయి. వీనిని యంత్రాలు అని పిలుస్తాం. ఎపుడైనా పిండి రుబ్బడాన్ని ఇంట్లో గమనించారా? లేకపోతే గమనించండి. గింజలు నానబెట్టి రోట్లో వేసి, రోకలితో దంచి లేదా రాతి రుబ్బురోలుతో రుబ్బి పిండి లేదా





పిండి ముద్దగా మారుస్తారు. ఇది శ్రమతో కూడుకున్న పని. ఇదే కరెంటుతో నడిచే గ్రైండర్‌తో తేలికగా పిండి రుబ్బుతున్న అమ్మను లేదా నాన్నను గమనించారా? లేకపోతే ఇపుడైనా గమనించండి. ఇలాగే ఇపుడు ఇళ్ళల్లో ఊడ్చడానికి చీపుర్లకు బదులు కరెంటుతో పని చేసే వాక్యూం క్లీనర్లు వచ్చాయి. పని భారాన్ని తగ్గించాయి.

శ్రమ భారాన్ని మరిచిపోయి హుషారుగా పని చేయడానికి కార్మికులు పాటలు పాడుతూ పని చేయడం సర్వసామాన్యం. వరి నాట్లు వేసే స్త్రీలను గమనించండి. వారు పాడుతూ నాట్లు వేస్తారు. ఇదే విధంగా రోజంతా పని చేసిన తరువాత సాయం కాలం ఆటలు పాటలతో తమ పని భారాన్ని, అలసటను మరిచి పోతారు. రాత్రి పడుకొనటంవల్ల వచ్చిన విశ్రాంతితో తిరిగి తెల్లారి హుషారుగా పని చేయడానికి సిద్ధమవుతారు. అంటే, మనం చేసే శ్రమ నుండే మన పాటలు, ఆటలు, నాటకాలు, ఇతర సాంస్కృతిక కళలు వచ్చాయన్న మాట. పెద్ద అయిన తరువాత మీరు ఇంకెన్నో కొత్త విషయాలను ఈ సందర్భంలో తెలుసుకోవచ్చు.

శ్రమ గురించి మరిన్ని విషయాలను వచ్చే సంచికలో తెలుసుకుందాం.



# తుప్పు పట్టని ఇనుప స్థంభం



ఇనుముతో తయారు చేసిన వస్తువులన్నీ కొన్నాళ్లకు తుప్పు పడుతుంటాయి. కానీ ఢిల్లీలో కుతుబ్‌మినార్ సమీపంలోని ఒక ఇనుపస్థంభం 1,600 సంవత్సరాల నుండీ తుప్పు పట్టకుండా నిలిచి వుంది. రసాయన విశ్లేషణాన్ని బట్టి చూస్తే ఈ స్థంభానికి 99.72 శాతం ఇనుమును వాడారని తేలింది. ఇది ప్రపంచ అద్భుతాల్లో ఒక అద్భుతమని చెప్పవచ్చు. ఇప్పుడున్న స్టీలు ఫ్యాక్టరీలేవీ కూడా ఇంత గట్టిదైనా స్థంభాన్ని సృష్టించలేవట. ప్రాచీన లోహభోధకులకు ఇనుము తుప్పు పట్టకుండా నిర్మించగల నేర్పు తెలుసు. అయితే దురదృష్టవశాత్తూ ఈ రహస్యం వారితోనే అంతమైపోయింది. ఈ స్థంభం 6 టన్నుల బరువుంటుంది. ఇదంతా ఒకటే ముక్క దీనికి మధ్యలో ఎక్కడా అతుకులు లేవు. దీని ఎత్తు 7.3 మీటర్లు (24 అడుగులు)



# తిమ్మప్ప తమాషాలు!! 3

# భలే ఇల్లు భయం భయం పూరిల్లు



- శాఖమూరి శ్రీనివాస్

స్వంత డాబా కట్టుకుని, ఊర్లోని వారందరినీ భోజనాలకు పిలిచినట్లు తిమ్మప్పకు కల వచ్చింది. ఉదయం లేచాక తన కల గురించి ఆలోచించాడు. అద్దె ఇంట్లో ఉండడం నామోషీ అనిపించింది. వీలైనంత త్వరగా స్వంత ఇల్లు నిర్మించుకోవాలని నిశ్చయించుకున్నాడు.

తన నిర్ణయాన్ని భార్యకు చెప్పాడు. ఆమె కూడా ఒప్పుకుంది. గతంలో తను కొన్న ఇంటి స్థలం దగ్గరకు వెళ్ళి చూశాడు తిమ్మప్ప. అదంతా పిచ్చి మొక్కలు, రాళ్ళతో నిండి ఉంది. భార్యా భర్తలిద్దరూ స్థలాన్ని శుభ్రం చేయడం మొదలు పెట్టారు.

ఆ స్థలం గతంలో శ్రీపురంలో నివసించిన అప్పల స్వామి అనే వ్యాపారిది. ఊర్లో అందరికీ తలలో నాలుకలా మెలిగిన అతనికి వ్యాపారంలో ఎన్నో ఒడిదుడుకులు, నష్టాలు సంభవించాయి. తన ఆస్తులన్నింటినీ అమ్మి అప్పులు తీర్చేశాడు. ఊరి మధ్యలో ఉన్న కాస్త స్థలం మాత్రం మిగిలింది. దానిని కూడా అమ్మేసి రంగనగరం వెళ్ళి స్థిరపడదామనుకున్నాడు ఆయన. అతనికి మదిలో తిమ్మప్ప మెదిలాడు ఎప్పుడు ఏ పని చెప్పినా విసుక్కోకుండా నవ్వుతూ చేసే తిమ్మప్పకు, ఆ స్థలాన్ని తక్కువ ధరకే అమ్మేశాడు.

భార్యా భర్తలు స్థలాన్ని చదును చేయడం పూర్తయ్యింది. అందులో ఒక పూరిల్లు వేయాలని ఇద్దరి ఆశ! దాచిన డబ్బులు లెక్కించాడు తిమ్మప్ప. వాటితో సగం ఇల్లు పూర్తవుతుందేమో! మిగతా సగం కొరకు



ఏం చేయాలో అర్థం కాలేదు. అప్పుడే తిమ్మప్ప మెదడులో ఓ మెరుపు మెరిసింది.

భూషయ్య తన డాబా పక్కనున్న పాత పూరిల్లు తీసేయాలనుకుంటున్నట్లు చాలా సార్లు తిమ్మప్పతో చెప్పి ఉన్నాడు. తీసేయమని కూడా చాలా సార్లు చెప్పాడు. కానీ, బద్ధకం వల్ల తిమ్మప్ప దాన్ని అంటుకోలేదు. దాని కప్పు పనికిరాక పోయినా వాసాలు, గుంజలు, బండలు ఉపయోగపడతాయి. వాటిని వాడుకుంటే సులభంగా తన ఇల్లు పూర్తవుతుందని తిమ్మప్ప సంబరపడ్డాడు.

వెంటనే వెళ్ళి ఆ పూరిల్లు గడ్డి, వాసాలు విప్పడం మొదలు పెట్టాడు. సగం పూర్తయిందది! ఇంతలో భూషయ్య వచ్చాడు. " ఏం చేస్తున్నావురా?" కోపంగా అడిగాడు. "ఎన్నోసార్లు మీరే కదా విప్పమంది! ఆ పనే చేస్తున్నాను." అన్నాడు వినయంగా.



"ఏడ్చినట్లుంది.... నేనెప్పుడో చెప్పిన పనిని ఇప్పుడా చేయడం! సరే ఇప్పుడు అమ్మాయి కాన్పుకు వస్తోంది. ఈ ఎండలకు పూరిల్లు అయితే చల్లగా ఉంటుందని, బన ఏర్పాటు చేద్దామనుకున్నాను. నీ నిర్వాకం వల్ల పుట్టబోయే పసికందు వేడికి ఉక్కిరి బిక్కిరి అయ్యే పరిస్థితి వచ్చింది.

భూషయ్య మాటలు వినగానే తిమ్మప్పకు తాను తప్పు చేశాననిపించింది. పని చేసే ముందే అడిగి ఉండాల్సిందనుకున్నాడు. " అయితే విప్పదీసిన ఈ వాసాల్ని మళ్ళీ కట్టి కప్పేయమంటారా?" అని అడిగాడు.

"నీ తలకాయలా ఉంది నీ ఆలోచన. చేసేది పూర్తిగా చేసి తగలడు.. కప్పు, వాసాలు పూర్తిగా తీసేయ్." అని చెప్పి ఇంట్లో కెళ్ళాడు భూషయ్య.

కప్పు లాగేసి రెండు వాసాలు తీశాడు తిమ్మప్ప. మూడో వాసం తీద్దామని అనుకునేలోపు దానిలో ఏదో శబ్దం వినిపించింది. చేతితో పట్టుకోకుండా కర్రతో దాన్ని కొట్టి క్రింద పడేశాడు. అందులోంచి నాలుగడుగుల పొడవున్న పాము ఒకటి బయటికి వచ్చి పడగ విప్పి నిలబడింది. దాని గుడ్లు కొన్ని నేలపై పగిలిపోయి ఉన్నాయి. దాన్ని చూడగానే గావుకేక పెట్టాడు తిమ్మప్ప.

ఇంట్లోంచి బయటికి వచ్చిన భూషయ్య పరిస్థితి గమనించాడు. ఇద్దరు పనివాళ్ళను పిలిచి ఆ పామును కొట్టించి చంపివేయించాడు. అది త్రాచుపాము! చాలా చురుగ్గా ఉండడంతో పని వాళ్ళు చాలా కష్టపడ్డారు.

ఆ పాము, అలాగే వాసంలో ఉండి, తన కూతురు పసిపాపతో అక్కడే ఉండి ఉంటే? అలా అనుకోగానే భూషయ్యకు ఒళ్ళు జలదరించింది.

తిమ్మప్పకు ధైర్యం చెప్పి మెల్లగా దించి, మిగతా వాళ్ళ చేత పూరిల్లు పూర్తిగా తీయించాడు. కొత్త పూరిల్లు కట్టేటప్పుడు తనకేగాక, తిమ్మప్ప ఇంటికి అవసరమైన సామాన్లు కూడా తెప్పించి ఇచ్చాడు భూషయ్య.

తిమ్మప్పకు ఇప్పటికీ వాసాలంటే భయం. మంచం మీద పడుకున్నా కప్పుకేసి ఏనాడూ చూడలేదు. ఠక్కున కళ్ళు మూసుకోవడం, వెంటనే నిద్రలోకి జారుకోవడం అంతే! 

3

పిట్ట కథలు



# 'పరిమళించిన మంచితనం'

- పుప్పాల కృష్ణమూర్తి

**మూ**డో పిట్ట నేల మీద వాలి " మంచి తనాన్ని, నిజాయితీని ప్రజలు ఎప్పుడూ మరిచిపోరు. సుగంధంలా అది మనుషుల మధ్య నిలిచే ఉంటుంది. అందుకు ఉదాహరణగా నీకో కథ చెబుతాను విను" అంటూ చెప్పసాగింది.

హఫీజ్ కోదాడలోని బస్టాండ్ కెదురుగా, వేపచెట్టు కింద, కొత్తగా పండ్ల దుకాణం ప్రారంభించాడు. నిజాయితీ పరుడు. ధర్మబద్ధంగా వ్యాపారం చేసేవాడు. ఎక్కువ రేటు చెప్పి, తగ్గించి యివ్వడం చేసేవాడుగాదు. పాడై పోయినవి, కుళ్ళిపోయినవి అస్సలు యిచ్చే వాడుగాదు. తూకం తక్కువ యివ్వడమనే ప్రసక్తే ఉండేదిగాదు. పట్టణంలో అందరి కంటే తక్కువకు, మంచి పండ్లు యిస్తాడని పేరు పడింది.

ఒక రోజు దూరపు బంధువు యింటికొచ్చాడు. "ఎంతకాలమిలా రోజు కూలితో కాలం గడుపుతావు. నీకూ యిద్దరు పిల్లలున్నారు. వాళ్ళను పెంచి, చదివించి పెండ్లి చేయాలి. నాకు తెలిసి కూరగాయల దుకాణంలో వచ్చిన లాభాలు పండ్ల దుకాణంలో రావు. మనవాడే లూజిద్దీన్ అని, మూడేళ్ళల్లోనే ఐదు లక్షలు సంపాదించాడు. ఖమ్మం మంచి బిజినెస్ సెంటర్. వచ్చెయ్యి నాతోపాటు" అన్నాడు కలాం.

" అవునండి. రోజు వచ్చే ఈ వంద,



రెండొందలతో పిల్లల్నేం చదివిద్దాం? మనం ఏం తిందాం. అన్నయ్య గారు చెప్పినట్లు, ఖమ్మంలో దుకాణమయితే ఎక్కువ లాభాలు వస్తాయండి. వెళ్దాం" అంది హఫీజ్ భార్య.

వెనకా ముందు ఆలోచించకుండా, దుకాణాన్ని బేరం పెట్టాడు. అదే సెంటర్‌లో పండ్ల దుకాణం పెడదామనుకున్న ఖదీర్ లక్ష రూపాయలకు దుకాణాన్ని కొనేశాడు. ఆ డబ్బులతో ఖమ్మం వెళ్ళి ఒక దుకాణాన్ని అద్దెకు తీసుకుని కూరగాయల వ్యాపారం మొదలు బెట్టాడు హఫీజ్.

ఆ మార్కెట్ ఒక మాయా ప్రపంచంలా అనిపించింది హఫీజ్‌కు. ధర తక్కువని నమ్మించి, సరుకు తక్కువ తూసి యిచ్చేవారు. ఒక సరుకు చూపించి, మరొకటి అంటగట్టే వారు. రైతుల వద్ద పెద్ద మొత్తంలో కొని, దాన్ని నాలుగైదు రెట్లకు అమ్మేవారు. వంటల మేస్త్రీలకు కమీషన్ యిచ్చి పెండ్లి వారు తమ వద్దే కూరగాయలు కొనేలా ఏర్పాటు చేసుకునేవారు. ఇన్ని దందాలు చేయడానికి, అతని మనసు అంగీకరించలేదు. తన కొట్టు ముందుకు వచ్చిన వారికి, న్యాయంగా ఇస్తే చాలనుకునేవాడు. కాని జనం వాళ్ళ మాటలకు ఆకర్షితులై మోసపోతూనే ఉండేవారు. హఫీజ్ కొట్లో కూరగాయలు తట్టలకు తట్టలు మిగిలిపోతుండేవి. అన్నీ వృధాగా పారబోయవలసి వచ్చేది. మిగతా వ్యాపారస్తులు, దుకాణానికి నాలుగు మేకల్ని



పెంచేవారు. ఆకుకూరలు, కూరగాయలు మిగిలితే వాటి ముందుంచేవారు. అవి తిని బలిస్తే, వాటి మాంసంతో డబ్బు సంపాదించేవారు. దీనికి తోడు హోల్‌సెల్‌గా కూరగాయలిచ్చే ఉస్మాన్ అలీ సరుకు సరిగ్గా యిచ్చేవాడుగాదు. అతనికి సాయంత్రం మందు పార్టీ యిచ్చిన వాళ్ళకు, యింట్లో ఫంక్షన్‌లకు పెద్ద పెద్ద బహుమానాలు యిచ్చిన వారికి మాత్రమే, మంచి సరుకు గిరాకీ వున్నది యిస్తుండేవాడు. తోటి వారిలాగే నువ్వూ దందాలు చేయి. ధర్మంగా వ్యాపారం చేయడమనేది వదిలి పెట్టు. నీకు పైసా ఎట్లవస్తదో, అదే ఆలోచించు. డబ్బుంటే అందరూ నిన్ను గౌరవిస్తారు. ఎలా సంపాదించావన్నది ఎవడూ పట్టించుకోడు అనేవాడు కలాం. కాని తనకవి పడవని, అబద్ధాలాడడం, మోసం చేయడం, తనవల్ల కాదని సున్నితంగా చెప్పేవాడు హఫీజ్. దీనితో మూడేళ్ళల్లోనే దివాళా తీశాడు హఫీజ్. అయినకాడికి అప్పులు చేశాడు. ఓ రాత్రి బాగా ఆలోచించి, ఉన్న సరుకు, సామాను మరొకతనికి అమ్మి, పెండ్లాం బిడ్డలను తీసుకుని, ఖాళీ చేతులతో కోదాడ తిరిగి చేరాడు హఫీజ్. తెలిసిన మిత్రులు అప్యాయంగా పలకరించి, సానుభూతి చూపారు. తోపుడుబండి పెట్టుకుని మళ్ళీ పండ్ల వ్యాపారం చేయమని సలహా యిచ్చారు.

మరుసటి రోజు తను అమ్మిన



దుకాణం వద్దకు వెళ్ళాడు. కొద్దిసేపు గుర్తే పట్టలేదు. దుకాణం బాగా పెద్దది చేయడమే గాకుండా, అక్కడ దొరకని పండ్లంటూ లేవు. జనం విపరీతంగా వచ్చి పండ్లు కొంటున్నారు. ఇద్దరు అసిస్టెంట్లు వాళ్ళకు పండ్లివ్వడానికి సతమతమవుతున్నారు. ఖదీర్ గల్లాపెట్టె ముందు కూర్చున్నాడు. హఫీజ్‌ను చూడగానే అప్యాయంగా కౌగలించుకున్నాడు. క్షేమ సమాచారాలడిగాడు. జరిగిన సంగతులు చెప్పాడు హఫీజ్. విచారపడిన ఖదీర్" అధైర్యపడకు. వ్యాపారంలో యివన్నీ మామూలే. కాని మన నిజాయితీ మనల్ని బ్రతికిస్తుంది. నీకు అన్ని విధాల నేను అండగా ఉంటాను. యింటికి వెళదాం పద" అని వెంట తీసుకుని వెళ్ళాడు. రెండంతస్తుల బిల్డింగు చూసి, నోరు వెళ్ళబెట్టాడు హఫీజ్. మిద్దె యింట్లో వాడు, ఎంత బిల్డింగ్ కట్టాడు?'' అని ఆశ్చర్యపోయాడు. భోజనాలయ్యాక, " నువ్వేం చేస్తున్నావో కాని, వినియోగదారులు నిన్ను బాగా నమ్మారు. అదృష్టవంతుడివి" అని అభినందించాడు.



''చేసిపోయిందంతా నువ్వే. న్యాయంగా, ధర్మంగా నువ్వు చేసిన వ్యాపారమే, నాకు కలిసి వచ్చింది. నా వద్దకు కొత్తలో వచ్చిన కొనుగోలుదారులు" హఫీజ్? చాలా మంచి పండ్లిస్తడు. తక్కువకిస్తడు" అని అడిగేరు. నువ్వు ఇపుడు ఇక్కడ లేవని చెబితే కొంత మంది రాకుండాపోయే ప్రమాద ముందనిపించింది. 'అతని బావ మరిదినే నేను. మొత్తం వ్యాపారం అతనిదే. నేను అసిస్టెంటునీ. వారానికోసారి వచ్చి లెక్కలు చూసుకుపోతుంటాడు'' అని అబద్ధం చెప్పేవాడ్ని. దాంతో కష్టమర్లు బాగా పెరిగారు. నువ్వే ప్రమాణాలతో వ్యాపారం చేశావో తెలుసుకుని, అదే సూత్రం పాటించాను. అందువల్లనే వ్యాపారం ఇంత పెద్దది చేయగలిగాను. నువ్వు చేసిన పొరపాటల్లా ఒక్కటే. వ్యాపారం పుంజుకునే సమయంలో, నాకిచ్చి వెళ్ళిపోయావు. దాన్ని నేను కాపాడుకోగలిగాను" అన్నాడు.

అతని నిజాయితీకి, ప్రజల నమ్మకానికి హఫీజ్ కళ్ళు చెమర్చాయి. " నేను దురదృష్టవంతుడ్ని చీకటిలో పండును పారేసి, చెట్టుమీది కాయల కోసం ఆశపడ్డాను. నాకు తగిన శాస్తి జరిగింది" అన్నాడు.

" నువ్వేం బాధ పడకు. ఈ టౌన్లో నిజాయితీ యింకా బతికే వుంది. హుజూర్‌నగర్ వెళ్ళే కార్నర్ మంచి సెంటర్. సినిమా హాళ్ళు, బస్సుస్టాపు, స్కూళ్ళు కూడా ఉన్నాయి. నేను పెట్టుబడి పెడతాను. దుకాణం ప్రారంభించు" అన్నాడు.

కళ్ళు చెమర్చగా అతని రెండు చేతులు పట్టుకుని, తల ఆనించి నమస్కారం చేశాడు.

ఒక మంచి రోజు చూసి, దుకాణాన్ని ప్రారంభించాడు హఫీజ్. పాత మిత్రులు, కొత్త కష్టమర్లు రాసాగారు. వంద గజాల దూరంలో ఏడు ప్రైవేటు ఆసుపత్రులు



కూడా ఉండడంతో వ్యాపారం మూడు కాయలు, ఆరు పండ్లుగా అభివృద్ధి చెందసాగింది. మొదటి ఏడాది, దుకాణం, కరెంటు ఖర్చులు పోగా, లక్ష రూపాయలు మిగిలాయి. సరుకిచ్చినందుకు లక్ష రూపాయలు ఖదీర్ చేతిలో పెట్టాడు హాఫీజ్. "తరువాత తీసుకుంటాలేకాని, ముందు అప్పులు తీర్చుకో అన్నాడు. దాంతో ఖమ్మంలో చేసిన అప్పులు పూర్తిగా తీర్చేసి, సరుకును బాగా పెంచాడు. రెండో ఏడాది నాలుగు లక్షల లాభం కళ్ళ చూశాడు. అప్పుడూ తీసుకపొయ్యి డబ్బివ్వబోగా, ముందు నువ్వుంటున్న దుకాణం కొనెయ్"



అన్నాడు ఖదీర్. అతను అమ్మను అనేసరికి పక్కనే వున్న దుకాణం కొనేశాడు. మరుసటి ఏడాది ఆరు లక్షల దాకా లాభం వచ్చింది. అప్పుడూ యివ్వబోగా, "కిరాయింట్లో ఎంత కాలముంటావ్? ఒక యిల్లు కొనుక్కో" అన్నాడు. ఐదు లక్షలు పెట్టి, కట్టిన ఓ యిల్లు కొనేశాడు హాఫీజ్. నాలుగో ఏడాది దుకాణాలు పెరిగి ఐదు లక్షలే లాభం వచ్చింది.

"నీ దయవల్ల యిప్పుడు నేను బాగా స్థిరపడ్డాను. ఒక దుకాణం కొనుక్కున్నాను. కొత్త యిల్లు కొనుక్కున్నాను. పిల్లల్ని ఇంజనీరింగ్ చదివిస్తున్నాను. యిక్కడ దుకాణం పెట్టినప్పట్నుంచి, నువ్విచ్చిన సరుకు నాలుగు లక్షల పైగానే అయింది. నీకూ రొటేషన్ కావాలిగదా. ఈ ఐదు లక్షలు తీసుకో" అని టేబుల్ మీద ఐదు కట్టలు ఉంచాడు హాఫీజ్.

"డబ్బు యిచ్చేసి, నన్ను పరాయి వాడ్ని చేద్దామనుకుంటున్నావా?" అన్నాడు ఖదీర్ ఒక నిమిషం ఆగి. "అమ్మమ్మా! అలాంటిదేం లేదు. మీరు చేసిన సాయానికి, మీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేను. కేవలం సరుకు యిచ్చినందుకు డబ్బులు మాత్రం యిస్తున్నాను" అన్నాడు.

"నా చేతనైనదేదైనా చేస్తాను. అజ్ఞాపించు" అన్నాడు తలవంచి హాఫీజ్."నా కూతుర్ని నీ కొడుక్కు చేసుకో. నువ్విచ్చే నాలుగు లక్షలే కట్నం అనుకో" అన్నాడు.

"హాఫీజ్‌కు నోట మాటరాలేదు. కోటీశ్వరుడు ఖదీరెక్కడ? తనెక్కడ? ఆనందంతో కళ్ళు తడిసిపోగా, ప్రేమగా కౌగలించుకున్నాడు.

ఆ ఎండా కాలవే షాహిన్‌కు, సిరాజ్‌కు పెళ్ళి చేశారు.

కోదాడలోనే కాక, జిల్లాలోనే మంచి వ్యాపారులని పేరు తెచ్చుకున్నారు హాఫీజ్, ఖదీర్‌లు.

కథ చెప్పడం పూర్తి రాగానే, న్యాయాన్ని, ధర్మాన్ని ప్రజలు ఆలస్యంగానైనా గుర్తిస్తారు. అందుకు ఉదాహరణే హాఫీజ్, ఖదీర్‌లు. ప్రతి వ్యాపారస్తుడు వారి నుంచి ఎంతో నేర్చుకోవలసి ఉంది". "ఈ కథ నాకు చాలా సంతోసాన్నిచ్చింది. నీ వంతు గింజ తీసుకుని వెళ్ళు" అంది గింజల్ని కాపలా కాస్తున్న నేహమ్మ అప్పుడు, మూడవ పిట్ట ఓ వడ్ల గింజ ముక్కున కరుచుకుని రివ్వున చెట్టెక్కింది.






ఒరే రామూ! చార్మినార్
ఎందుకు కట్టించారురా?


పైకి ఎక్కి హైదరాబాద్
నగరమంతా చూడటానికి సార్!


ప్రవీణ్


నీతో ఫ్రీగా మాట్లాడలేక
పోతున్నాను శివా!!


పోనీ... ఎంతో
కొంత డబ్బిచ్చే
మాట్లాడు
ప్రవీణ్





యువర్ గుడ్
నేమ్ ప్లీజ్
అంటే నీ ఉద్దేశం? నాకో
చెడ్డ పేరు కూడా ఉందా?
ప్రవీణ్...




మీ వాడు
ఏం చేస్తున్నాడు శివా?
ఎల్.కే.జి.
చదువుతూ
లాంగ్ టర్మ్
ఎంసెట్
కోచింగ్
తీసుకుంటున్నాడు
ప్రవీణ్...

# పొడుపు కథలు

- శాఖమూరి శ్రీనివాస్

1 బొడ్లో కత్తి దాచుకుంది
విరగబడి నవ్వుతుంది
సువాసనలను వెదజల్లుతుంది.

2 రూపం తెల్లన
ఒళ్ళేమో చల్లన.
చూస్తుండగానే కరిగి
పారిపోవును జర్రున.

3 కడుపు నిండా నీళ్ళను తాగి
అందరి మీదకు ఊస్తుంది
నల్లగా అగుపడుతుంది.

4 కదిలితే కదులుతాయి
ఎగిరితే ఎగురుతాయి
నిద్రపోతే అవి కూడా నిద్రిస్తాయి
ఏమిటవి?

5 తలుపు లేని జైలులో తొంభై ఆరు
ఖైదీలు.

6 రాజు గారి కోటకు రెండు దారులు
లోపలికి వెళ్ళే వారొకరు
బయటికొచ్చేది మరొకరు.

7 పైపైకే వెళుతుంది... గాలిపటం కాదు
మెలికలు తిరుగుతుంది... పాముకాదు
మాయమవుతుంది... ఊహకాదు.

8 దొంగతనం చేసినా దొంగకాదు
అబద్ధాలాడినా కపటికాదు
మోసం చేసినా మోసకారి కాదు
ఎవరీ వింత మనిషి?

9 నిప్పు తగిలితే చిటపటలాడే చిన్నోడు
నీరు తగిలితే కరిగిపోతాడు.

10 నిలువుగా బరువు మోస్తుంది
అడ్డంగా అయితే చితికిపోతుంది
పెనం మీద పడిందా....
ముక్కపుటాలెగురుతాయి.

### విడుపులు

1. గులాబి, 2. వడగళ్ళు, 3. మేఘం,
4. గజ్జెలు 5. వేండి వండు,
6. ముక్కురంధ్రాలు, 7. పొగ, 8. నటుడు,
9. ఉప్పు, 10. కోడిగుడ్డు.

## బస్సు



హైటెక్ బస్సు
రైయ్యిన వచ్చె
ఆగిన పిదప ఎక్కండీ
కదిలే బస్సును
ఎక్కొద్దూ!
కదిలే బస్సు
దిగవద్దూ!
చక చక నడకల చిన్నోడా!
చక్కెరకేళీ తిన్నోడా!!

- భూపాల్




| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | ■ |
| | ■ | 4 | | ■ | 5 |
| 6 | | | ■ | 7 | |
| ■ | ■ | 8 | | | |
| 9 | 10 | | ■ | | ■ |
| 11 | | | | | ■ |

(పద ప్రహేళిక)

**ఆచార్య నందూరి గోవిందరావు**

కింద ఇచ్చిన దీర్ఘ చతురస్రంలో అడ్డం, నిలువు ఆధారంతో ఎంపిక చేసుకొన్న పదంతో పూర్తి చేయండి. పదంల ఉండాల్సిన అక్షరాల సంఖ్య ఆధారం పక్క బ్రాకెట్టులో ఇవ్వబడింది. ఇవి ఒక రకమైన పొడుపు కథలు. కరెక్టు సమాధానాలు ఇదే సంచికలో వేరే పేజీలో ఇవ్వబడ్డాయి. వీనితో మీ సమాధానాలను పోల్చి చూసుకోండి.

**ఆధారాలు**

**అడ్డం :**

1. వంటనూనె నిచ్చే ఒక రకం పంట(5)
4. ప్రమిద (2)
6. స్త్రీ; భార్య (3)
7. చరిత్ర; గాథ (2)
8. నుదురు (4)
9. చిన్న శరీరం కలిగి సంఘజీవనం సాగించే ఒక కీటకం, పిపీలిక (2)
11. మూడు కాళ్ళ ఎత్తు బల్ల (5)

**నిలువు :**

1. ఎవరు ఎక్కువ ధర పలికి కొంటామంటారో వారికే వస్తువును అమ్మే పద్ధతి (3)
2. దుష్యంతుడి పెంపుడు కుమార్తె, భీష్ముడికి మారు తల్లి (4)
3. ఏరు, భారీ జల ప్రవాహము (2)
5. కూర్పు, రచన; కావ్యము (5)
7. కష్టము, బాధ (3)
9. పుండువలన ఏర్పడే ద్రవం (2)
10. మహమ్మద్ ప్రవక్త జన్మస్థానం; అరేబియా దేశంలోని ఒక పుణ్యనగరం (2)



## కుక్కకు జైలు శిక్ష

1972లో లిబియాలో ఒక మనిషిని కరవబోయిన నేరానికిగాను ఒక కుక్కను అరెస్టు చేసి కొన్ని నెలల పాటు జైలు శిక్ష విధించారు. శిక్షా కాలంలో దీనికి బ్రెడ్, నీరు ఇచ్చేవారు. శిక్ష మొత్తం పూర్తయ్యాకనే దానిని విడిచిపెట్టారు.



# "కన్నా" తెలివి తేటలు?



1 నా పుణ్యమా అని మా అమ్మా నాన్న పేరెంట్స్ అయ్యారు.

2 నేనూ తెలుగు భాషపై పోరాటం చెయ్యాలనుకుంటున్నాను. ఏం చక్కా ఒకే సబ్జెక్టు చదువుకోవచ్చు.

3 చదువు అబ్బని నాలాంటి వారే సిన్మాస్టార్స్ మేధావులు అయినట్టు చరిత్ర చెబుతుంది.

4 ఈ చదువుల్ని బుర్రలోకి కాకుండా కంప్యూటర్లలోకి ఎక్కిస్తే బావుంటుంది.

5 మా చదువుల పుణ్యమా అని ఈ పంతుళ్ళు బతుకుతున్నారు.

6 భూమి మీద పుట్టడం...?
మనం చదువుకుని పిల్లల్ని కని
వారిని చదివించడం కోసమే.

7 గృహ హింస చట్టం లాగ చదువు హింస చట్టం పెడ్తే బావుండు.

- గంధం శ్రీనివాస్



# వింతైన లోకంలో వింతైన వింతలు

- మేహర్ వీరగోపాల్ వాసంసెట్టి

ప్రతి మనిషి రోజుకు రెండు కాకపోయినా కనీసం ఒకసారైనా స్నానం చేయటం మనకున్న అలవాటు. కానీ బర్మా దేశానికి చెందిన "కాచిక" అనే తెగ ఆటవికులకు స్నానం అంటే ఏ మాత్రం గిట్టదు. స్నానం చేయటాన్ని అదొక పెద్ద పాప కార్యంగా బావిస్తారు వారు. జీవితం మొత్తం మీద ఈ తెగ ఆడవారు కానీ, మగవారు కానీ మూడేసార్లు స్నానం చేస్తారు.

అందులో రెండు స్నానాల విషయం గురించి వారికేమి తెలియదు. వీరు తొలి స్నానం పుట్టినపుడు. ఈ స్నానం గురించి వీరికెవరైనా చెబితే తప్ప తెలిసేది కాదుగదా! జీవితంలో వీరికి తెల్సి తెల్సి చేసే స్నానం వివాహం రోజున చేసే స్నానం మాత్రమే. ఇక జీవితంలో వీరు చేసే మూడవ స్నానం .... చనిపోయిన తరువాత. ఈ స్నానం గురించి వారికి తెలుసుకునే అవకాశమేలేదు కదా! కనుక యదార్థానికి వీరి జీవితంలో వారంతటవారు చేసే స్నానం ఒక్క స్నానమే. అదీ పెళ్లి స్నానం మాత్రమే.

రాజస్థాన్‌లో దాదపు 400 గ్రామాల్లో ప్రజలు మంచి నీళ్లు దొరకని కారణంగా తమకు దొరికే ఉప్పు నీటినే త్రాగుతారు. ఈ విధంగా ఉప్పునీటిని త్రాగటం వలన రాజస్థాన్‌లోని నాగోర్ జిల్లా, బాంకాంపట్టీ మండలంలోని రఘునాథ్ పురా అనే గ్రామంలో చిన్న, పెద్ద, ఆడ, మగ అందరూ గూనివాళ్లే. రాజస్థాన్‌లోని నసీరాబాద్‌కు దాదాపు 5 కిలోమీటర్ల దూరంలో ఉండే ఈ గ్రామం దేశంలోనే కాక, ప్రపంచంలోనే ఏకైక గూని వాళ్ల గ్రామం.

ఆకాశంలో ఎగరగల ఎగిరే కప్పలు ఉన్నాయంటే మీకు నమ్మకం కలగకపోవచ్చు. కానీ ఇవి ఉన్న మాట వాస్తవం. వీటి కాలి వ్రేళ్ల మధ్య బాగాన్ని కలుపుతూ పలుచని చర్మపు పొర ఉంటుంది. ఇవి గాలిలో పక్షుల్లా ఎగరలేపోయినా ఒక చెట్టుపై నుండి, మరొక చెట్టు పైకి అలా అలా గాలిలో తేలుతూ రావటానికి ఉపయోగపడుతుంది. 15 మీటర్ల ఎత్తులో హాయిగా ఎగరగల ఈ కప్పలు కోస్టారికా ప్రాంతంలో విరివిగా ఉన్నాయి.

సూర్యుని చలనానికి అనుగుణంగా ప్రొద్దు తిరుగుడు పూలు ఎలా అయితే కదులుతుంటాయో అచ్చం అలానే "మెల్ వీడ్" అనే మొక్క యొక్క ఆకులు కూడా సూర్యుని చలనానికి అనుగుణంగా కదులుతూ ఉంటాయి. సాయంత్రం సమయంలో సూర్యుడు పశ్చిమాద్రికి చేరేసరికి ఆయనకెదురుగా తిరిగి ఉండే ఈ మొక్క ఆకులు - సూర్యాస్తమయం కాగానే ముడుచుకుపోతాయి. మరల తూర్పు దిక్కుగా తిరిగి సూర్యోదయానికై ఎదురు చూస్తుంటాయి. ఆ సూర్యునికి, ఈ మొక్కకు ఉన్న ఈ అనుబంధం ఏమిటో తెల్సుకోవటం ఈ రోజుకీ శాస్త్రజ్ఞులకు సాధ్యపడలేదు. ఈ మొక్క ఆకుల ఈ వింత ప్రవర్తనలో ఆంతర్యం కూడా అవగాహనకు రాలేదు.

## ఇంగ్లీషు + తెలుగు అక్షరాలు = తెలుగు పదాలు

**" J " తో జంగ్**

'J' ండా
'J' మున
'J' ్రి
'J' బు
'J' గంట
'J' లు
'J' ంక్షన్

**' B ' తో బిర్యాని**

B' డీలు
B' య్యం
B' రుదు
B' చ్చం
B' రకాయ
B' స్కెట్
B' రియాని
B' ందువు

**' G 'తో 'గజిబిజి'**

G' లకర
G' ంక
G' డి
G' మ్
G' లేబి
G' ల్లేడు
G' గురు
G' త్తులమారి
G' ర్ణం

**' K 'తో 'కసరత్తు'**

K' ంద్రం
K' సరి
K' క
K' శపాశం
K' సరం
K' తువు
K' ళి

**' O 'లో 'ఓనమాలు'**

O' డ్డు
O' డుదొడుకు
O' డలు
O' ట్టు
O' కపొద్దు
O' కింత
O' కటి
O' ళ్ళు
O' ంటరీ
O' త్తిడి
O' ప్పందం
O' టమి
O' డ
O' దార్చు
O' ని

**' P 'తో పకోడీలు**

'P' ంచం
'P' ంగాణి
'P' ండి
'P' ందె
'P' డక
'P' క్క
'P' చ్చి
'P' పిడికిలి
'P' దుగు
'P' తామహ
'P' న్నీ
'P' చ్చి
'P' లక
'P' లుచు
'P' ల్లనగ్రోవి
'P' ల్లి
'P' శాచి
'P' సినారి
'P' ట్ట

నిర్వహణ : **స్నేహిత్, 3వ తరగతి, భైంసా**

## వెళ్ళి తెచ్చేసుకుందాము

వెన్న ముద్ద నెందుకమ్మా
ఆకాశాన వేళాడదీసారు?
మేఘాలు ఎత్తుకుపోతున్నాయి
మోయలేక వేరొక చోట వదిలేస్తున్నాయి
వానకు పడిపోతుందేమో
వెళ్ళి తెచ్చేసుకుందాము!

ఉదయాన రాకాసి ఎత్తుకు పోతుందేమో
పగలసలు కనబడదు
రాత్రికి పారిపోయి వస్తుందేమో
నిలకడగా ఒక చోట ఉండదు
మళ్ళీ రాకాసి ఎత్తుకుపోక ముందే
వెళ్ళి తెచ్చేసుకుందాము

ఎవరో తినేస్తున్నట్టున్నారు
రోజూ కొంత తరిగిపోతుంది
చీకటి మింగేస్తుందో ఏమో
ఒక్కోసారి అసలు కనబడదు
మళ్ళీ మాయమైపోకముందే
వెళ్ళి తెచ్చేసుకుందాము!

**- కె. విజయభాను**



# ఎత్తుకు పై ఎత్తు



- రమ

అది మంచి వానాకాలం. వారం రోజులపాటు కుండపోత వాన కురిసి, వెలిసింది. 'హమ్మయ్య.... వాన వెలిసింది. ఇక ఆహారం కోసం వెతుకులాట మొదలుపెట్టవచ్చు' అనుకున్నాయి అడవిలోని జంతువులన్నీ. వెంటనే తిండి కోసం వేట మొదలుపెట్టాయి. కాని అడవిలోని చెట్లన్నీ గాలివానకు వంగిపోయాయి. వాటికి వున్న కాయలు రాలిపోయాయి. దాంతో జంతువులు, పక్షులకు ఆహారం దొరకలేదు. అలాగని ఆకలి కాకుండా ఉంటుందా? అసలే వారం రోజుల్నుండి సరిగ్గా తిండిలేదు. ఇక ఇప్పుడైనా సరిగ్గా తిండి తినకపోతే అవి ఇంకా నీరసించిపోతాయి. అందుకే బురదలోపడి కుళ్లిపోతున్న కాయల్నే ఏరుకొని తిన్నాయి. మురికిగా వున్నా కుంటల్లో నీళ్లు తాగి గొంతు తడుపుకున్నాయి. ఆకలైతే తీరింది. కానీ కొత్త కొత్త సమస్యలు మొదలయ్యాయి.

శుభ్రంగా లేని ఆహారం తినడం వల్ల జంతువులు అనారోగ్యం పాలయ్యాయి. కుంటల్లోని కలుషితమైన నీరు తాగడం వల్ల కొన్నింటికి వాంతులు, విరేచనాలు పట్టుకున్నాయి. మరికొన్నింటికి జలుబు, జ్వరం, దగ్గులాంటి జబ్బులు వచ్చి పీడించసాగాయి.

అనారోగ్యంతో అల్లాడుతున్న జీవాలను ఆదుకోడానికి రంగంలోకి దిగాయి చెరువులో కప్పలు. అవి శుభ్రమైన ఆహారం, నీళ్లు అందించడంతోపాటు తమకు చేతనైనంతలో వైద్యం కూడా మొదలుపెట్టాయి. వీటన్నింటికీ నాయకత్వం వహిస్తోంది ఓ ముసలి కప్ప. దానికి కొంచెం వైద్యం కూడా తెలుసు. అడవిలో దొరికే



వనమూలికలతో రకరకాల మందులు తయారుచేసి, రోగాల బారినపడిన జంతువులకు ఇచ్చేది. మొత్తానికి కప్పల కృషి ఫలితంగా అడవిలో వ్యాపించిన అంటురోగాలు త్వరలోనే తగ్గుముఖం పట్టాయి. జంతువులన్నీ సంతోషించాయి. తమకు ఇంత మేలు చేసిన కప్పలకు చేతనైన రీతిలో కృతజ్ఞతలు తెలిపాయి.

వారం రోజుల్నుండి రోగం కారణంగా పడక దిగని జిత్తులమారి నక్క ఆ రోజే తన నివాసాన్ని వదిలి బయటికొచ్చింది. అప్పటికే సూర్యోదయమైంది. బాలభానుణ్ణి చూస్తూ చెరువు పక్కనే నడుస్తోంది నక్క. వారం రోజుల్నుండి రోగం కారణంగా తను పడిన ఇబ్బందుల్ని తలచుకుంటోంది. ఇలాంటి జబ్బు రాకుండా ముందే ఏదైనా జాగ్రత్తలు తీసుకుంటే బావుండేది అనుకుంటోందది. అప్పుడే దానికి చిన్నప్పుడు వాళ్ల అమ్మ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.



"అరరే.... కప్ప మాంసం తింటే వానాకాలంలో ఎలాంటి అనారోగ్యం దరిచేరదని అమ్మ చెప్తుండేది. ఈ విషయం ఎప్పుడో గుర్తొస్తే ఎంత బావుండేది? ఇప్పటికేనా మించిపోయిందేమీలేదు. ఇంకా వానాకాలం పూర్తవ్వలేదు. ఇప్పటికైనా ఏదో ఒక కప్పను పట్టుకొని తింటే.... ఇక ముందు ఇలాంటి పాపిష్టి రోగాలు రాకుండా ఉంటాయి" అనుకుంది నక్క. దాని దృష్టి అప్పుడే చెరువులో జలకాలాడి బయటికొస్తున్న ముసలి కప్ప మీద పడింది.

"ఈ కప్పను తింటే ఇక మనకే రోగాలు రావు. దీన్ని ఎలాగైనా బుట్టలో పడెయ్యాలి" అనుకుంది జిత్తులమారి నక్క. అలా ఓ నిర్ణయానికొచ్చిన తర్వాత నక్క తన ఇంటికెళ్లిపోయింది.

. . .

ఆ మర్నాడు అడవిలో కొన్ని కరపత్రాలు కనిపించాయి. చెట్ల మానులకు పోస్టర్లు కూడా అంటించి ఉన్నాయి. వాటి సారాంశమేమంటే, "ఆపద సమయంలో అడవిలోని జంతువులకు తన శక్తిమేర సేవ చేసి, వాటికి స్వస్థత చేకూర్చిన ముసలి కప్పగారి సేవలను అభినందిస్తున్నాం. చంద్రునికో నూలు పోగులా మా ట్రస్టు తరపున వారిని సత్కరించదలిచాం. మేం ఏర్పాటుచేసే ఈ కార్యక్రమానికి ఆహ్వానితులు మాత్రమే హాజరుకాగలరు" అని.

అది చదివిన జంతువులన్నీ ఎంతో సంతోషించాయి. ముసలి కప్పను అభినందనలతో ముంచెత్తాయి. కప్ప కూడా సంతోషించింది. అయితే మర్నాడే ముసలి కప్ప పేరు మీద ఒక ఉత్తరం వచ్చింది. అందులో, "అనివార్య కారణాల వల్ల సత్కార కార్యక్రమం వాయిదాపడింది. అందువల్ల మా ట్రస్టు తరపున ఒకరు వచ్చి మిమ్మల్ని కలుస్తారు. అసౌకర్యానికి చింతిస్తున్నాం" అని



ఉంది. అది చదివి ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది ముసలి కప్ప.

ఆ తర్వాత రెండు రోజులకు మిట్టమధ్యాహ్నం వేళ ఓ జంతువు చెరువు దగ్గరకొచ్చింది. పేరు పెట్టి కప్పను పిలిచింది. కప్ప నీళ్ల పైకి వచ్చి, "ఎవరండీ మీరు? మీకేం కావాలి?" అని అడిగింది వినయంగా.

"నా పేరు నమ్మకం. నేను మీకు సత్కారం చేయాలనుకున్న ట్రస్టు సభ్యుణ్ణి. అనివార్య కారణాల వల్ల ఘనంగా జరపాలనుకున్న మీ సత్కార కార్యక్రమాన్ని వాయిదా వేయాల్సి వచ్చినందుకు ఎంతో చింతిస్తున్నాం. మీకు ఇవ్వాలనుకున్న మెమొంటోని మీకు అందజేయడానికి వచ్చాను. మీరిలా ఒడ్డుకొస్తే మీకు అందిస్తాను'' అంది చేతిలోని మెమొంటోని చూపిస్తూ.



కప్ప చెరువు ఒడ్డుకొచ్చింది. కప్ప చేతికందే దూరానికి రాగానే అప్పటివరకూ వేరే జంతువులా ముసుగు వేసుకున్న నక్క అమాంతం దాని మీదకు దూకింది. కప్పను నోటితో పట్టుకొని ఒడ్డుకొచ్చి, తినడానికి శతవిధాలా ప్రయత్నించింది. కానీ కప్ప శరీరం సాగుతుందే తప్ప ఒక్క అవయవం కూడా ఊడిరాలేదు. దాంతో నక్కకు నిరాశకు లోనైంది. అయినా పట్టువదలకుండా ప్రయత్నిస్తూనే ఉంది. ఇంతలో నీళ్లల్లో నుండి పెద్దగా నవ్వుతూ బయటికొచ్చింది ముసలి కప్ప. దానివంక విచిత్రంగా చూసింది నక్క. వెంటనే తన కాళ్ల వైపు చూసుకుంది. అక్కడ వుంది ముసలి కప్ప కాదు. దాని ముసుగు. నక్కకు జరిగిన మోసం అర్థమైంది.

"ఛీ.... నువ్వు నన్ను మోసం చేస్తావా?" కోపంతో ఊగిపోతూ అంది నక్క.

"అలాగనుకుంటే నువ్వు చేసిందేంటి? సత్కారం, గిత్కారమంటూ నన్ను నువ్వు మోసం చేయలేదా? ఆ వంకతో నన్ను తినెయ్యాలని పథకం వేసింది నువ్వు కదా. మొదట నువ్వు తెచ్చిన కరపత్రాలు చూసి నేనూ మోసపోయాను. ఆ తర్వాత రోజు వచ్చిన ఉత్తరాన్ని చూసిన తర్వాత ఎందుకో ఆలోచనలో పడ్డాను. ఎందుకంటే.... ఆ ఉత్తరం వచ్చింది ఇక్కడినుండే. వేరే ఊరి నుండి వస్తే కవరు మీద ఆ ఊరి స్టాంపు ఉండాలి. అలా ఏమీలేదు. అంటే... దీన్ని ఎవరో కావాలనే చేశారనిపించింది. అదెవరో తెలుసుకుందామనే నేనూ ఇలా చేశాను. ఇంతవరకు జరిగింది చాలు. ఇకమీదట ఇలాంటి పిచ్చి పిచ్చి తెలివితేటలు ప్రదర్శించావో మిగిలిన జంతువులకు చెప్పి, నీ అంతు తేలుస్తా. ముందు వెళ్లిక్కడి నుండి" అని గద్దించింది కప్ప. దాంతో నక్క చెవులు జాడించుకుంటూ వెళ్లిపోయింది.



# కాగితపు కిరీటం



- క్రాంతి

**హా**య్ ఫ్రెండ్స్! ఎలా ఉన్నారు? పరీక్షలు అయిపోయాయిగా. ఆటపాటలతో బిజీబిజీగా వుండి ఉంటారు. అవునా! దొరక్క దొరక్క దొరికిన అవకాశం. ఎలా వదలుకుంటార్లెండి?! కానీ ఒక్క మాట. ఈ సెలవుల్ని కేవలం ఆటపాటలకే పరిమితం చేయకండి. కొత్త కొత్త విషయాలు నేర్చుకోవడానికీ, మీకిష్టమైన రంగాల్లో (బొమ్మలు వేయడం, కథలు, కవితలు రాయడం, కాగితాలతో బొమ్మలు చేయడం లాంటివన్నమాట) ప్రావీణ్యం సంపాదించడానికీ ఉపయోగించండి. రకరకాల కథల పుస్తకాలు చదవండి. రోజూ పేపర్ చదివి, మీరు ఆ రోజు నేర్చుకున్న కొత్త విషయాలన్నీ ఓ పుస్తకంలో రాసి, పెట్టుకోండి. ఇష్టమైనవే కాదు. కష్టమైనవి నేర్చుకోడానికీ ఇదే సువర్ణావకాశం. ఉదాహరణకు మీ చేతిరాత బాగా లేదనుకోండి. ఈ సెలవుల్లో రోజూ ఒక పేజీ చూచిరాత రాయండి. సెలవులు అయిపోయేంతలో మీ చేతి రాత ఎంత మెరుగుపడుతుందో గమనించండి. కొంతమంది లెక్కలంటే భయం. మరికొంతమందికి సైన్స్ అంటే హడల్. ఇలా మనల్ని భయపెట్టే పాఠ్యాంశాల మీద పట్టు సంపాదించడానికి కావాల్సినంత సమయం దొరికేది ఈ సెలవుల్లోనే. మరి సెలవుల్ని సద్వినియోగం చేసుకుంటూ ముందుకు సాగుతారు కదూ.



అన్నట్టు మర్చిపోయా? ఇవాళ మీకు కాగితంతో కిరీటం చేయడమెలాగో నేర్పిద్దామనుకుంటున్నాను. దీన్ని తయారు చేయడం చాలా తేలిక. పైగా మీ స్నేహితులకు బహుమతిగా ఇవ్వడానికీ బావుంటుంది.

## ఏమేం కావాలి?

ఒక పెద్ద మందపాటి కాగితం (ఒకే రంగుదైతే మంచిది), రంగు రంగుల చార్టు లేదా కాగితం ముక్కలు, స్కెచ్‌పెన్నులు లేదా రంగు పెన్సిళ్లు, కత్తెర, స్కేలు, బంక.





## ఎలా తయారుచేయాలి?

ముందుగా మందపాటి కాగితాన్ని తీసుకోండి. దాని మీద వృత్తలేఖినితో పెద్ద వృత్తాన్ని గీయండి. ఇప్పుడు ఆ వృత్తం వెంబడి కత్తెరతో జాగ్రత్తగా కత్తిరించండి. ఇప్పుడు దీని అంచుకు మూడు, నాలుగు సెంటీమీటర్ల దూరంలో లోపలివైపు ఇంకో వృత్తాన్ని గీయండి. ఇది ఎంత వుండాలంటే.... లోపలి కాగితాన్ని కత్తిరిస్తే మీరు తలకు పెట్టుకోడానికి సరిపోయేంతగా ఉండాలి. ఇప్పుడు ఈ వృత్తాన్ని విభజిస్తున్నట్లుగా స్కేలు సాయంతో మధ్యలో ఎనిమిది గీతలు గీయండి. సందేహంగా వుంటే మొదటి బొమ్మ చూడండి.

ఇప్పుడు బ్లేడు సాయంతో లోపలివైపు వున్న త్రిభుజాలను కత్తిరించండి. మొత్తం కత్తిరించకుండా మధ్యలో వున్న నిలువు గీతలను మాత్రమే కత్తిరించండి. వృత్తం అంచుల దగ్గరకు రాగానే త్రిభుజాకారంలో వున్న కాగితాన్ని పైకి (రెండవ బొమ్మలోలా) మడవండి. ఇలా చుట్టూ చేయండి. ఇప్పుడు కిరీటం సిద్ధమయ్యింది. దీన్ని మనకిష్టమొచ్చిన రీతిలో అలంకరించుకోవచ్చు. మీకు పువ్వులంటే ఇష్టమనుకోండి. రంగు రంగుల చార్టు ముక్కల్ని వివిధ రకాల పువ్వుల ఆకారాల్లో కత్తిరించాలి. వాటికి మీకిష్టమొచ్చిన రంగులు వేయండి. ఇప్పుడు ఆ పువ్వుల ఆకారం వరకు కత్తెరతో కత్తిరించి, ఇందాకటి కిరీటానికి పై వైపున (మూడవ బొమ్మలో మాదిరిగా) బంకతో అంటించండి. ఒకవేళ మీకు పువ్వుల బొమ్మలు గీసి, వాటిని సరిగ్గా కత్తిరించడం రాకపోతే ఏమాత్రం బాధపడొద్దు. ఎంచక్కా చార్టు ముక్కల్ని రకరకాల ఆకారాల్లో కత్తిరించండి. వాటి మీద మీకు నచ్చిన డిజైన్లు వేయండి. మంచి డిజైన్లు ఏమీ రాకపోతే చక్కగా సున్నాలు గీయడమో, చిన్న చిన్న చుక్కలు పెట్టడమో చేయండి. ఇలా చేసిన వాటినే కిరీటం పై భాగాన అంటించండి.

ఇంకాస్త ఎక్కువగా మీ కిరీటాన్ని అలంకరించుకోవాలనుకుంటే కాగితంతో చేసిన రిబ్బన్ ఒకదాన్ని కిరీటానికి ఒకవైపున అంటించండి. అంతే.... మీ కోసం మీరు తయారుచేసుకున్న కిరీటం రెడీ. ఇక దీన్ని పెట్టుకోండి. రాజ్యాలు లేకపోయినా రాజుల్లా ఫోజు పెట్టొచ్చు. సరేనా! 





మ్యాజిక్

# కాల్చిన కాగితంలోని అక్షరాలు

## చేతి మీద ప్రత్యక్షం

- షేక్ జహీర్ బాషా

**ప్రదర్శన :** తెల్ల కాగితం ముక్క మీద మెజీషియన్ ఏదో వ్రాస్తాడు. ఈ కాగితం ముక్క కూడా ప్రేక్షకుల నుండి తీసుకొంటాడు. ప్రేక్షకుల్లో ఒకరిచే రాసి ఉన్న కాగితం ముక్కను కాల్చి మసి యివ్వమంటాడు మెజీషియన్. అలా మసి తీసుకున్న మెజీషియన్ విచిత్రపు మంత్రాలు చదువుతూ చేతి మీద పూస్తూ కాల్చి ఉన్న కాగితంలోని అక్షరాల్ని చేతి మీద సృష్టించి అందర్నీ ఆశ్చర్యపరుస్తాడు మెజీషియన్.

**అంతరంగము :** జిల్లేడు పాలలో సన్నటి పుల్ల (లేదా) గుండు సూదిని ముంచి చేతిమీద రాసి ఉంచుకొంటాడు మెజీషియన్. అడగగానే కంటికి కనిపించదు ఆ రాత. వేపకాయ పాలు గానీ, ఇతర చెట్ల పాలతో గానీ రాయవచ్చు కూడ. సబ్బును నీళ్ళల్లో కరుగ దీసి ఆ నీటితో కూడా రాయవచ్చు.

**గమనిక :** కాగితంలో రాసే రాత లాంటిదే అన్ని రకాలుగా చేతి మీద రాతకు పోలికలు ఉండాలి. కాగితం మీద సన్నటి పేనాతో సన్నని, చిన్నని అక్షరాలు వ్రాసి చేతి మీద లావుపాటి, పెద్దవైన అక్షరాలు రాయడం ప్రదర్శనకు ఎంత వరకు సబబుగా ఉంటుందో గమనించండి.



# నేల తల్లి

విరబూసిన విరులతోట మనది
నిర్జీవమవని పచ్చని పచ్చిక మనది
కరువెరుగని కల్పవల్లి
అందాల మన నేల తల్లి

బిడ్డలకు బడాయిలు కావల్సొచ్చాయి
నాగరికతకు కొత్త కొమ్ములొచ్చాయి
కాలుష్యం కోరలు విసిరింది
భూగోళం వేడెక్కిపోతోంది

మానవ మేధ తల్లి వినాశనానికి
ఉపయోగ పడ్తోంది
ఉపద్రవం ఒకొక్కటిగా
వచ్చి పడ్తోంది
భూమాత భవిత మన భవిత కాదా?!
ప్రపంచ శ్రేయస్సు ప్రశ్నార్థక మయ్యింది.

వసివాడుతున్న విరులతోట మనది
నిర్జీవమౌతున్న పచ్చిక మనది
కరువు కోరలు చాచెను నేడు
నేల తల్లిని కాపాడుదాం నడు.

- కె. విజయ భాను

# చిలుకలు ఎలా మాట్లాడతాయి?

చిలుకలు మాట్లాడలేవు. నిజానికి మానవుడు మినహా ప్రకృతిలోని ఏ ప్రాణీ మాట్లాడలేదు. తన ఆలోచనల్ని నోరు విప్పి చెప్పనూలేదు. అయితే చిలుకలకు కొంత మినహాయింపు ఉంది. అవి మనం మాట్లాడే మాటల్ని అనుకరించగలవు. అలా చేయడం వాటికి ఇష్టం కూడా. అందుకే మనం మాట్లాడిన మాటను తిరిగి అనడానికి ప్రయత్నిస్తాయి. అది కూడా పదే పదే విన్న తర్వాత మాత్రమే నెమ్మదిగా పలకగలవు. అంతేగానీ వాటంతట అవి మాట్లాడవు. ఒకవేళ చిలుక ఏదైనా పదం లేదా వాక్యాన్ని నేర్చుకుంటే అది దాన్ని మర్చిపోవడమంటూ జరగదు. దాని జ్ఞాపకశక్తి అంత గొప్పది.

## సమాధానాలు : పదప్రహేళిక-6

అడ్డం : 1. వేరుశనగ, 4. కుంది, 6. ముదిత, 7.కథ, 8.లలాటము, 9. చీమ, 11. ముక్కాలి పీట

నిలువు : 1. వేలము, 2. శకుంతల, 3. నది, 5. గ్రంథము, 7.కటకట, 9. చీము, 10. మక్కా



# ఉడికిన గుడ్డు ఏది?



- లిఖిత

"హలో.... ఏంటీ... ఆదివారం రోజు కూడా పుస్తకాలతో తెగ కుస్తీ పట్టేస్తున్నారు? ఇంతకీ రేపు ఏమైనా పరీక్ష ఉందా?" పుస్తకంలో నుండి తల పక్కకు తిప్పకుండా చదువుతున్న మిత్రుల్ని అడిగాడు వినయ్.

"పరీక్ష ఏమీలేదు. కానీ పరీక్షలు దగ్గరకొస్తున్నాయి కదా. అందుకే చదువుతున్నాం. అయినా చదువుకోకుండా నువ్విలా వచ్చావేంటి?!" ఆశ్చర్యంగా అడిగాడు వివేక్.

"మరి మీరంతా ఇక్కడికెందు కొచ్చారు?" ఎదురు ప్రశ్నించాడు వినయ్.

"గ్రూప్ స్టడీ కోసమా?" అడిగాడు వివేక్.

"కాదు. నేను మీతో ఆడుకోవాలని వచ్చాను. కానీ మీరేమో చదువు మూడ్‌లో ఉన్నారాయే" అన్నాడు వినయ్.

"మాకూ ఆడుకోవాలనే ఉంది. కానీ పరీక్షలు దగ్గరకొస్తున్నాయి కదా. ఈ కొద్దిరోజులైనా ఆటపాటలకు స్వస్తి చెప్పాలని నిర్ణయించుకున్నాం" చెప్పాడు రహీమ్.

"ఆటపాటలతో కాసేపైనా విశ్రాంతి తీసుకోకపోతే మన బుర్ర వేడెక్కిపోతుంది. అప్పుడు వేడెక్కిన కారు ఇంజన్‌లా మన బుర్ర కూడా 'ఇక నా వల్ల కాద'ంటూ మొరాయిస్తుంది. కాబట్టి కాసేపు ఆడుకుంటే నష్టమేంలేదు. చదివిన కాసేపైనా శ్రద్ధగా చదివితే చాలు" అన్నాడు వినయ్.

"అది నిజమే కానీ.... మన పాఠాలకు పనికొచ్చే ఆటలేమైనా ఆడదాం" చెప్పాడు వివేక్.

"సరే అయితే. నేను మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను. దానికి మీరు సమాధానం చెప్పాలి. సరేనా!" అన్నాడు వినయ్.



"సరే. ఇంతకీ ప్రశ్న ఏంటి?" ఉత్సాహంగా అడిగాడు రహీమ్.

"ఇవాళ ఆదివారం కదా. ప్రతి ఆదివారం అమ్మ మాకోసం చికెన్ వండుతుంది. కానీ ఇవాళ మా నాన్న ఊరెళ్లారు. చికెన్ ఎప్పుడూ ఆయనే తెస్తారు. ఆ షాపు ఎక్కడో అమ్మకు కూడా తెలియదు. అందుకని ఈ వారానికి కోడిగుడ్లు వండుతానని అమ్మ చెప్పింది. నేను, చెల్లి సరేనన్నాం. గుడ్లు కూడా ఉడకబెట్టింది. ఆరిన తర్వాత పెంకు వలుద్దామని చెప్పి గుడ్లన్నీ తీసి, ఓ పక్కన పెట్టింది. ఇంతలో హిమాయత్‌నగర్‌లో వుండే మా బాబాయి వాళ్లు వచ్చారు. వాళ్ల కోసం కూడా వంట చేద్దామనుకుంది అమ్మ. ఉడకబెట్టిన గుడ్లు అందరికీ సరిపోవు కదా. అందుకని ఫ్రిజ్‌లో మిగిలిన గుడ్లు కూడా తీసి బయటపెట్టింది. ఇంతలో పిన్ని ఏదో కావాలని అడిగితే అది ఇవ్వడానికెళ్లింది. అలాగే బాబాయివాళ్లతో కబుర్లు చెప్తూ కూర్చుండిపోయింది. ఎప్పటికో వంట సంగతి గుర్తుకొచ్చింది. తీరా వచ్చి చూస్తే... అంతకుముందు ఉడకబెట్టిన గుడ్లు, ఉడకబెట్టని గుడ్లు పక్కపక్కనే ఉన్నాయి. వాటిల్లో ఏవి ఉడికినవో, ఏవి ఉడకనివో అమ్మకు అర్థంకాలేదు. గుడ్డు పగలగొట్టకుండా ఏవి ఉడికిన గుడ్లో కనుక్కోవడం ఎలా?" ఇంట్లో జరిగిందంతా చెప్పి, చివర్లో ప్రశ్న సంధించాడు వినయ్.



మిత్రులంతా ఆలోచనలోపడ్డారు. ఎంతసేపటికీ వాళ్లకు జవాబు తట్టలేదు. చివరకు సమస్యకు పరిష్కారం ఏంటో చెప్పమని వినయ్‌నే అడిగారు.

"మొదట నాక్కూడా తెలియలేదు. అప్పుడు మా బాబాయ్ ఓ చిట్కా చెప్పాడు" అన్నాడు వినయ్.

"ఏంటది?" ఆతృతగా అడిగారు మిత్రులంతా.

"విడివిడిగా వున్న గుడ్లలో నుండి ఒక్కొక్క గుడ్డు తీసుకోమన్నాడు. వాటిని వేర్వేరు ప్లేట్లలో పెట్టి కదల్చమన్నాడు. 'ఏ గుడ్డు ఊగడం త్వరగా ఆగిపోతే ఆ గుడ్డు ఉడికినది' అని చెప్పాడు" వివరించాడు వినయ్.

"మీ బాబాయ్ చెప్పింది నిజమేనా! త్వరగా ఆగిపోయిన గుడ్డు ఉడికినదేనా?" సందేహంగా అడిగాడు రహీమ్.

"అవును. ఉడికిన గుడ్డు ఆగిపోయిన తర్వాత కొద్దిసేపటివరకు పచ్చిగుడ్డు ఊగుతూనే ఉంది" చెప్పాడు వినయ్.

"అది త్వరగా ఎందుకు ఆగిపోయింది? పచ్చిది ఎందుకు ఆగలేదు? నీకేమైనా తెలుసా?" దీర్ఘంగా ఆలోచిస్తూ అన్నాడు వివేక్.

"తెలుసు. పచ్చిగుడ్డు లోపల తెల్ల సొన, పచ్చసొన ఉంటాయి కదా. అవి ద్రవ రూపంలో ఉంటాయి. కాబట్టి గుడ్డు కదలికలకు అనుగుణంగా లోపల వున్న ద్రవాలు కూడా కదులుతుంటాయట. దీనినే సైన్సులో 'ఇనెర్షియా' అంటారట. దానివల్లే ఉడికిన గుడ్డును తేలిగ్గా గుర్తించవచ్చని బాబాయ్ చెప్పాడు" అంటూ జవాబు కూడా తానే చెప్పాడు వినయ్.

"అలాగా. ఈ సూత్రాన్ని మనం బాగా గుర్తుపెట్టుకోవాలి. రేపు పరీక్షల్లో ఉపయోగపడొచ్చు" కిందకు జారిన కళ్లజోడుని పైకి లాక్కుంటూ అన్నాడు రహీమ్.

"అవునవును...." అంటూ మిత్రులు కూడా అతనికి వంత పాడారు.



# జై తెలుగు తల్లీ

చిట్టి పొట్టి బాలల్లారా
చిరు చిరు నవ్వుల దివ్వెల్లారా
తెలుగు తేజపు మొలకల్లారా
విరిసీ విరియని మొగ్గల్లారా
వికసించే తేట తెలుగు మల్లెల్లారా
తేనెలొలుకు తెలుగు భాష
మనదే మనదే
బ్రతుకు తెరువుకై పంచన జేరిన
బ్రిటిష్‌వాడు, వాడి భాష
అంటు వ్యాధిలా అంటించాడు
అమ్మ వంటిది జన్మభూమి
తెలుగు గడ్డపై పుట్టిన
బిడ్డల్లారా, కమ్మనైన
తెలుగు భాషను నోరారా
పలకండి, పొరుగు భాషను
కించపరచ నక్కరలేదు
మాతృభాషను మరువకండి
తెలుగు తల్లి ఒడిలో పెరిగే
భావి పౌరులు మీరు
తెలుగు భాషను పలుకండి
తెలుగు పాట పాడండి
మనసార పలుకండి
తెలుగు తల్లికి జేజేలు
జై తెలుగు తల్లీ ॥
జై తెలుగు తల్లీ ॥

**– గురజాడ విజయశ్రీ**

# స్నేహమేరా జీవితం

స్నేహమేరా జీవితం అంటారు; అలాగే స్నేహితులు లేని మనిషిని నమ్మకూడదంటారు; నీ స్నేహితులెవరు చెప్పు నీవెలాంటి వాడివో చెబుతాను అన్నాడు షేక్‌స్పియర్ అనే పెద్ద ఆంగ్ల కవి.

ఇవన్నీ వింటే స్నేహానికి ఉన్న విలువ తెలుస్తుంది. కాబట్టి మంచి వారితోనే స్నేహం చేయాలి. ఇతరులతో కలిసి మెలసి ఉండవచ్చుకాని గాఢమైన స్నేహం చేయరాదు.

స్నేహితులు ఏదైనా తప్పు చేస్తున్నట్టు తెలిస్తే వారిని మంచిగా మార్చటం మన బాధ్యత. స్నేహితులతో ఉట్టి ఆటపాటలే కాకుండా చదువు, సంగీతం, చిత్రలేఖనం, చదరంగం, వివిధ విషయాలపై పుస్తకపఠనం వంటి వాటిల్లో కూడా పాలుపంచుకోవాలి. వారి పుట్టిన రోజున శుభకాంక్షలు చెప్పటం మరచిపోకుండా చేస్తే వారి స్నేహం ఇంకా గట్టి పడుతుంది.

**చదువు**

రూపా రూపా
రూపాయి బిళ్ల!
చదివిన వారికి
చక్కర గుల్ల!
చదవని వారికి
మట్టి పెల్ల!!

**- భూపాల్**



పుస్తక పరిచయం

# పిల్లల గణితం

చాలా మంది పిల్లలకు లెక్కలను చేయడం భారంగా అగుపడుతుంది. లెక్కలు చేయడానికి అంతగా ఇష్టతను చూపరు. ఇట్టి వారు క్లాసులో చెప్పే లెక్కలను కూడా సరిగ్గా అర్థం చేసుకోలేక సామాన్యంగా వెనుకబడతారు. దీనికి ప్రధాన కారణం లెక్కల్లో వీరికి సరైన ఆసక్తిని కలిగించ లేకపోవడమే.

ఆకర్షణ నుండి ఆసక్తి పుడుతుంది. ఆసక్తి నుండి ఆలోచన వస్తుంది. ఆలోచన నుండి అవగాహన కలుగుతుంది. ఈ అవగాహన శక్తి నుండే సృజనాత్మక శక్తి వస్తుంది. ఈ సృజనాత్మక శక్తికి ఆత్మ స్థైర్యం తోడైతే ప్రతివారు ప్రతిభావంతులు కాగలరని ఈ పుస్తక రచయిత ఇట్టెమల్ల చంద్రయ్య అభిప్రాయ పడ్డారు. అందుకే పిల్లల్లో లెక్కల యెడల ఆకర్షణను, ఆసక్తిని కలిగించడానికి 'పిల్లల గణితం" అనే పుస్తకాన్ని రాశారు.

ఈ పుస్తకంలో లెక్కల్లో ఆసక్తిని కలిగించేందుకు ఎన్నో అంశాలను చేర్చారు. ఉదాహరణకు, 1 నుండి ఏ సంఖ్య వరకైన వరుసగా రాసి కలిపితే సమాధానాన్ని ఎలా కనుక్కోవచ్చో అనే రహస్యాన్ని క్లూ రూపంలో ఈ పుస్తకంలో ఇచ్చారు. అలాగే వరుసగా బేసి, సరి సంఖ్యల మొత్తాలను ఎలా తేలికగా కనుక్కోవచ్చో వివరించారు. ఇలా లెక్కలను ఎలా తేలికగా చేయవచ్చో వివరించారు.




ఈ పుస్తకం చదివిన పిల్లలకు లెక్కలంటే ఆకర్షణ, ఆసక్తి తప్పక పుడుతుంది. ప్రజాశక్తి బుక్ హౌస్ వారు ప్రచురించిన ఈ పుస్తకం రు. 25/- లకే అమ్మబడుతుంది. 2003 సంవత్సరంలో మొదటి ముద్రణ వచ్చినప్పటి నుంచి వేల కాపీలను కొనుక్కొని పిల్లలు లాభపడు తున్నారు. కాబట్టి, పిల్లలు లెక్కలను తేలికగా నేర్చుకునేలా ఆసక్తి కలిగించడానికి ఈ పుస్తకాన్ని తప్పని సరిగా చదివించాలి. ప్రజాశక్తి బుక్ హౌస్ అన్నీ బ్రాంచీలలో ఈ పుస్తకం దొరుకుతుంది.

ఈ వేసవి సెలవుల్లో ప్రతి పిల్లవాడు లెక్కల్లో ఆసక్తిని పెంచుకోవడానికి సరదాగా ఆడుతూ పాడుతూ చదువుకోవాల్సిన పుస్తకం ఇది. 



# అతి విలువైన కానుక



- సత్య ప్రసూన

వంశీ, గోపి, రాజు, రాధిక, శాలిని - వీళ్ళంతా కజిన్స్. అంటే అన్న, తమ్ముళ్ళు, అక్క చెల్లెళ్ళు పిల్లలన్న మాట. అందరూ 10- 12 సంవత్సరాల వయసు వారే. అందరూ పోటీ పడి 5-7 వ తరగతులలో చదువుతున్నారు.

ఆ రోజు పరీక్షా ఫలితాలు వచ్చాయి. రాజు, రాధిక స్కూల్‌లో ఫస్ట్ వచ్చారు. రాధిక పుట్టిన రోజు కూడా కలిసి వచ్చింది. దాంతో రాధిక తల్లిదండ్రులు రాధిక మిత్రులకు విందును ఏర్పాటు చేశారు.

విందు తరువాత తల్లిదండ్రులు తమ కూతురు రాధికకు ఒక ప్యాకెట్‌ను అందజేశారు. దాని మీద "పుట్టిన రోజు సందర్భంగా ప్రేమతో తల్లిదండ్రులు ఇచ్చిన అమూల్యమైన, అపూర్వమైన కానుక" అని రాశారు.

ఏమై ఉంటుందా? అని ఆలోచించి ఉత్సాహంగా ప్యాకెట్‌ను విప్పింది రాధిక. ప్యాకెట్లో 'ఫోటో అల్బమ్' ఉంది. పుట్టిన రోజు నుండి అమ్మ వడిలో నిద్ర, పాలు తాగడం, బోర్ల పడడం, పాకడం, అన్నప్రాశన, బుడి బుడి నడకలు, చందమామను చూపిస్తూ గోరు ముద్దలు తినడం, అక్షరాభ్యాసం, నాన్న స్కూలుకు పంపడం, అమ్మ గేటు దగ్గర తన రాకకై ఎదురు చూడడం, అమ్మ ఆత్రుత, ఆరాటం, ఆవేదన, అమ్మ నాన్నలు తనతో ఆడుకోవడం, చదువు చెప్పటం మొదలైన ఫోటోలు అన్నీ ఆ ఫోటో అల్బమ్‌లో అతికించి ఉన్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే పుట్టిన క్షణం నుండి నేటి వరకు తన బాల్యాన్ని ఫోటోల రూపంలో తనకు 'పుట్టిన

రోజు కానుక'గా ఇచ్చారు. ఇవన్నీ చూసి రాధికకు ఎంతో సంతోషం వేసింది.

అల్బమ్‌లో తన ఫోటోలతో పాటు ఇంకా కొన్ని ఫోటోలు ఉన్నాయి. అవి చూసిన రాధిక "నాన్నా ఈ ఫోటోలు ఎవరివి?" అని అడిగింది. "వీళ్ళు ఎవరో నీకు తెలియదు కదా! నువ్వు వాళ్ళనెవర్ని చూడలేదు. ఇవి తాత నాయనమ్మ, అమ్మమ్మ, తాతయ్య, మామయ్యలు, బాబాయ్‌లు, మేనత్తలు, పెదనాన్నలు. ఇపుడు వీరందరూ ఎక్కడెక్కడో దూర ప్రాంతాలలో ఉంటున్నారు. కొంత మంది దూర దేశాల్లో ఉంటున్నారు. నీకు బంధువులు, బంధుత్వాలు, బంధాలు తెలియ జేయటం కోసమే ఇలా అల్బమ్‌లో పెట్టి బహూకరించాము." అని చెప్పాడు నాన్న.

రాధికకు ఎన్నడు లేనంత సంతోషం కలిగింది. "వీళ్ళందర్ని ఎపుడు ఎలా చూస్తాను నాన్నా" అని అడిగింది.

దానికి రాధిక తల్లిదండ్రులు "ప్రతి సంవత్సరం వేసవి సెలవుల్లో ప్రోగ్రామ్ వేసుకొని తీసుకు వెళ్ళి అందర్ని చూపిస్తాము." అని మాట ఇచ్చారు. ఇది పుట్టిన రోజున అనుకోకుండా రాధికకు ఇచ్చిన మరొక కానుక.

రాధిక ఫ్రెండ్స్ కూడా ఎంతో సంతోషించి తమ అమ్మ నాన్నలకు కూడా చెప్పాలని పరుగు పరుగున ఇళ్ళకు వెళ్ళారు.

చూశారా బాలలూ! రాధికకు వారి తల్లిదండ్రులు ఇచ్చిన అపూర్వమైన కానుక. ఈ కానుక "అమూల్యమైనది, అపూర్వమైనదే కాక అతి విలువైనది, వెల కట్టలేనిది."

# తేలిగ్గా చేద్దామా?

అయిదుతో ముగిసే అంకెల వర్గం

అయిదుతో ముగిసే సంఖ్యల వర్గాన్ని ఇట్టే తేలికగా క్షణంలో చేయవచ్చు. ఈ కింది వర్గాలకు గమనించండి.

| సంఖ్య | | | వర్గం |
|---|---|---|---|
| 5×5 | = | | 25 |
| 15×15 | = | (1×1+1) | 225 |
| 25×25 | = | (2×3) | 625 |
| 35×35 | = | (3×4) | 1225 |
| 45×45 | = | (4×5) | 2025 |
| 55×55 | = | (5×6) | 3025 |
| 65×65 | = | (6×7) | 4225 |
| 75×75 | = | (7×8) | 5625 |
| 85×85 | = | (8×9) | 7225 |
| 95×95 | = | (9×10) | 9025 |
| 105×105 | = | (10×11) | 11025 |
| 195×195 | = | (19×20) | 38025 |

ఒకట్ల స్థానంలో ఉన్న '5' వర్గాన్ని ఒకట్లు, పదుల స్థానంలో "25" గా రాయండి. ఇక పదులు లేక వందల స్థానంలో ఉన్న సంఖ్యను తీసుకొని దానికి ఒకటి కలపగా వచ్చిన దానిని 'వర్గం' కనుక్కోవాల్సిన సంఖ్యలోని పదులు లేదా వందల సంఖ్యతో మామూలుగా హెచ్చించండి. అలా వచ్చిన సంఖ్యను '25' ముందు రాయండి. సంఖ్య వర్గం విలువ క్షణంలో తెలుసుకోవచ్చు. ఎంత తేలిక. మీరు కూడా ఇతర సంఖ్యల 'వర్గం' విలువ తెలుసుకోండి. ఎంతో సరదాగా, తేలికగా ఉంటుంది కదూ !!

- కోయి శ్రీహరినాథ్



# అమ్మాయి చదువు




- జ్యోతిర్మయి

ఫ్రెండ్స్! ఆటపాటలతోపాటు చదువుసంధ్యల్లోనూ అబ్బాయిలకు సరైన పోటీ ఇస్తున్నారు ఈనాటి అమ్మాయిలు. పోటీ ఇవ్వడమే కాదు. కొన్నిసార్లు రాష్ట్రస్థాయిలో మొదటి ర్యాంకులు సాధించి, అగ్రస్థానాన నిలుస్తున్నారు. అలాంటి అమ్మాయిల గురించి గొప్పగా చెప్తుంటే, మన ఇళ్లల్లో పెద్దవాళ్లు అనే మాట మీకేమైనా గుర్తుందా? కాలం మారింది. ఈ కాలంలో అమ్మాయి అయితే ఏంటి? అబ్బాయి అయితే ఏంటి? ఎవరైనా ఒక్కరే అనే కదూ.

'కాలం మారిందంటున్నారు. అంటే అంతకుముందు పరిస్థితి ఎలా ఉండేది?' అని మీరు ఎప్పుడైనా తెలుసుకునే ప్రయత్నం చేశారా? కొంతమంది చేసుంటారు. వెనకటి రోజుల్లో అమ్మాయిల్ని చదువుకోడానికి బడికి పంపేవారు కాదు. ఇంటి పని, వంట పని నేర్పి పదేళ్లు నిండకుండానే పెళ్లి చేసేసేవారు. ఆ తర్వాత ఇంటి బరువు బాధ్యతలతోనే ఆమె జీవితం గడిచిపోయేది. ఒకవేళ ఇంట్లో పెద్దవాళ్లకు తమ పిల్లల్ని చదివించాలని వున్నా పాఠశాలలు, కళాశాలల్లో ఆడపిల్లలకు ప్రవేశం ఉండేది కాదు. ఇదంతా స్వాతంత్ర్యం రాక ముందటి పరిస్థితి.

మొట్టమొదటిసారిగా 1848వ సంవత్సరంలో బొంబాయి (ఇప్పటి ముంబై)లో అమ్మాయిల కోసం ప్రత్యేకంగా ఓ బడిని ప్రారంభించారు. మన దేశ నాయకుల్లో ఒకరైన దాదాభాయ్ నౌరోజీ విజ్ఞప్తి మేరకు ఆ బడికి తమ పిల్లల్ని పంపించడానికి కొంతమంది తల్లిదండ్రులు ముందుకొచ్చారు. కాకపోతే వాళ్లు ఒక షరతు విధించారు. అదేంటంటే... 'మా అమ్మాయిలకు ఒక్క ముక్క కూడా ఆంగ్లం (ఇంగ్లీషు) నేర్పకూడదు' అని. పాశ్చాత్య చదువులు తమ పిల్లల్ని పాడు చేస్తాయనేది వాళ్ల అభిప్రాయం. అయితే.... పిల్లలకు చదువు నేర్పడం ముఖ్యం కాబట్టి తల్లిదండ్రుల షరతుకు పాఠశాల నిర్వాహకులు తలొగ్గారు. దాంతో ఇంకొంతమంది అమ్మాయిలు కూడా బడిలో చేరారు.



కానీ బడి నిర్వాహకులకు ఆంగ్లం వల్ల ఉపయోగాలేంటో బాగా తెలుసు. అందుకే తన విద్యార్థినులకు రహస్యంగా ఆంగ్లం నేర్పించడం మొదలుపెట్టారు. కానీ ఈ విషయం ఎలాగోలా బయటకు పొక్కింది. అమ్మాయిల బడిలో ఆంగ్లం నేర్పుతున్నారనే వార్త ఓ గుజరాతీ పత్రికలో వచ్చింది. 'ఆంగ్లం నేర్చుకునే అమ్మాయిలు తమ భర్తల్ని సరిగ్గా చూసుకోరని, ఇక ఆ భర్తల బతుకు నరకప్రాయమేనని కూడా ఆ పత్రిక పేర్కొంది.

'ఇంకేముంది? ఇక మా పిల్లలు పాడైపోయినట్లే. వీళ్లను భస్తే బడికి పంపకూడదు' అనుకున్నారు కొంతమంది తల్లిదండ్రులు. 'ఆంగ్లం నేర్చుకుంటే తప్పేంటి? ఇప్పుడు మనల్ని పాలిస్తోంది ఆంగ్లేయులే కదా. కాబట్టి ఆంగ్లం నేర్చుకుంటే ముందు ముందు దేనికైనా ఉపయోగపడొచ్చు కదా. ఈ మాత్రం దానికి బంగారం లాంటి పిల్లల చదువు మాన్పించడ మెందుకు?' అనుకున్నారు ఇంకొంతమంది. ఏదేమైతేనేం? గుజరాతీ పత్రికలో వచ్చిన వార్త ఆడపిల్లల తల్లిదండ్రుల్ని పెద్దగా ప్రభావితం చేయలేకపోయింది. బడి కొనసాగింది. పిల్లల చదువు నిరాటంకంగా సాగింది. అయితే అది ఆరవ తరగతి వరకే. ఆ తర్వాత పై చదువులు చదవడానికి వీళ్లకు అనుమతిలేదు.



ఇదిలావుండగా, 1857వ సంవత్సరంలో బొంబాయి, కలకత్తా యూనివర్శిటీలు ప్రారంభమయ్యాయి. అయితే మొదట ఇందులో కూడా అమ్మాయిలకు ప్రవేశంలేదు. ఆ యూనివర్శిటీలోని రిజిస్టర్లలో అమ్మాయిల పేర్లు నమోదవడానికి మరో పద్దెనిమిదేళ్లు పట్టింది. 1875లో సొరాబ్జీ ఖార్సేట్‌జీ అనే పార్సీ వ్యక్తి వాళ్లమ్మాయి పదవ తరగతి పరీక్షలు రాయడానికి అనుమతివ్వాలని కోరుతూ బొంబాయి యూనివర్శిటీకి ఉత్తరం రాశాడు. కానీ అతని విజ్ఞప్తిని యూనివర్శిటీ వర్గాలు తోసిపుచ్చాయి. అదే సంవత్సరం చంద్రముఖి బసు అనే యువతి కూడా తనను పదవ తరగతి పరీక్షలకు అనుమతించ మంటూ కలకత్తా యూనివర్శిటీని కోరింది. ఆమెకు కూడా అనుమతి నిరాకరించారు.

మరో రెండేళ్ల తర్వాత అంటే.... 1877లో విశ్వవిద్యాలయంలోకి అమ్మాయిల్ని అనుమతిస్తున్నట్లుగా కలకత్తా యూనివర్శిటీ ప్రకటించింది. మరో ఆరేళ్ల తర్వాత (1883 నుండి) బొంబాయి యూనివర్శిటీ కూడా కలకత్తా విశ్వవిద్యాలయం బాటలోనే నడిచింది. అప్పటి నుండి అమ్మాయిల్ని విశ్వవిద్యాలయాల్లోకి అను మతిస్తున్నారు.

1883లో చంద్రముఖి బసు, కాదంబిని బసు అనే ఇద్దరు అమ్మాయిలు మొట్టమొదటిసారిగా కలకత్తా యూనివర్శిటీ నుండి డిగ్రీ పట్టా అందుకున్నారు. వారే మన దేశంలోకెల్లా మొట్టమొదటి మహిళా పట్టభద్రులు. బొంబాయి యూనివర్శిటీ నుండి మొట్ట మొదట డిగ్రీ పొందిన మహిళ కొర్నిలియా సొరాబ్జీ. ఇదంతా చదువుతుంటే మనకిప్పుడు ఆశ్చర్యంగా ఉండొచ్చు. కానీ ఇలాంటి ఎన్నో సామాజిక బంధనాల్ని ఛేధించుకుంటేనే మహిళలు నేటి స్థితికి చేరగలిగారు. ఇంత పురోభివృద్ధి సాధించినా వాళ్లను ఇంకా ద్వితీయ శ్రేణి పౌరులుగా, శక్తిహీనులుగానే చూస్తున్నారు. అది తప్పు కాదంటారా? సమాజంలో వారికివ్వాల్సిన విలువ ఇవ్వకపోగా, వివక్ష చూపడం సమంజసమే నంటారా? ఆలోచించండి. 






# సర్దార్ భగత్‌సింగ్



- శివాజీ

చిన్న వయసులోనే తన లక్ష్యాన్ని చాటి 'దేశం కోసం ఎలా మరణించాలి' అనే పాఠాన్ని దేశానికి నేర్పాడు. అతడు విప్లవ వీరుల సంస్థకు 'సామ్యవాదం' ఆదర్శమని చాటి జాతిపిత, నేతలకంటే ముందు చూపును, విజ్ఞతను, సాహసాన్ని నిరూపించుకున్న గురువు. "విప్లవం వర్ధిల్లాలి" అంటూ గర్జించి, నవ్వుతూనే మృత్యువును వరించిన ఘనుడు. అతడే సర్దార్ భగత్‌సింగ్.

వార్తా పత్రికల్లో వస్తున్న బ్రిటిషువారి దారుణకృత్యాలు వింటున్న ఆ అబ్బాయికి వారిపైన ద్వేషం ఎక్కువ కాసాగింది. చిన్నతనం నుండే దేశ భక్తి నిండుకున్న అతను కులమత విభేదాలకతీతంగా వ్యవహరించ దలచుకున్నాడు.

తన తండ్రి మిత్రుడొకడు " నీది ఏ మతం?" అని అతన్ని అడిగితే " దేశసేవే నా మతం" అని సమాధానమిచ్చాడు.

ఆ ప్రాంతంలో ఏ అలజడిరేగినా వేళాపాళా చూడకుండా పోలీసులు వచ్చి అతని తండ్రిని అరెస్టు చేసి ఎక్కడికో తీసుకుపోతుండేవారు. మళ్ళీ ఏ పదిహేను రోజులకో, నెలకో వదిలివేసేవారు. అర్థాంతరంగా పోలీసులు వచ్చి కారణం చెప్పకుండా తండ్రిని ఎత్తుకుపోవడం ఆ అబ్బాయిని ఆందోళన పరిచింది.

అతని రక్తం పోలీసుల మీద, తెల్లవారి మీద కసితో సలసలకాగేది.

ఓసారి పొలంలో నాట్లు వేస్తున్న తండ్రితో, " నాన్న గారూ! గోధుమ గింజలు నాటితే ఇంత పండింది కదా! తుపాకులూ, తూటాలూ నాటితే మరెంత ఫలితమో?!" అన్నాడు. అందుకు ఆ తండ్రి ఎంతగానో పొంగిపోయాడు. తనకున్న దాన్ని పదుగురితో పంచుకుతినడంలో వున్న ఆనందం ఒంటరిగా పాయసం జుర్రుకుంటే వుండదని అర్థం చేసుకున్నాడు.

ఎప్పుడూ తన జేబులో ఓ ఫోటో దాచుకొని పదే పదే చూసేవాడు. ఆ ఫోటో చూసినప్పుడల్లా తెల్లవారిపై అతనికి కసి విపరీతంగా పెరిగేది. అది అతి చిన్న వయసులోనే దేశం కోసం ప్రాణత్యాగం చేసిన కర్తార్‌సింగ్ ఫోటో. అతన్నే తన గురువుగా భావించాడా అబ్బాయి.

చూశారా బాలలూ!! అతి చిన్న వయసులోనే దేశం, దేశ ప్రజల గురించి ఎంతగా ఆలోచించాడో? ఆలోచించడమే కాక దేశ ప్రజల స్వాతంత్ర కోసం ముందుగానే అనుకొని తన ప్రాణాలనే త్యాగం చేసిన వీరకిశోరం. జీవించి ఉన్నంత కాలం విదేశీ బ్రిటిష్ సామ్రాజ్య పాలకులకు సింహ స్వప్నంగా ఉన్నాడు. సామ్రాజ్య వాద శక్తులను ఎలా ఎదిరించి పోరాడాలో ఏ ఉపాధ్యాయుడు చెప్పలేని పాఠాలను మన జాతికి తన ప్రాణ త్యాగంతో చెప్పాగలిగాడు. 

# ఫ్లయింగ్ ఫాక్స్ అంటే....




ఫ్లయింగ్ ఫాక్స్ అంటే అదేదో ఎగురుతున్న నక్క అనుకుంటే పొరపాటే. ఎందుకంటే 'ఫ్లయింగ్ ఫాక్స్' అనేది ఒక రకమైన గబ్బిలం. ఈ రకం గబ్బిలాల తలలు నక్కను పోలి వుండటం వలన వీటికాపేరు వచ్చింది. చాలా రకాల గబ్బిలాలు నక్కను పోలి వుండి చిన్న చిన్న కుక్క పిల్లల సైజులో వుంటాయి. వీటి రెక్కల పొడవు దాదాపు 6 అడుగుల పైనే వుంటుంది. వీటి అలవాట్లు ఇతర సాధారణ గబ్బిలాల మాదిరిగానే వుంటాయి. అయితే వీటికో వింత ఆహారపు అలవాటు వుంది.




వీటికి పండ్లు అంటే అమితమైన ఇష్టం. ఈ కారణంగా అవి పండ్ల తోటలకు గొప్ప ఉపద్రవంగా పరిణమించాయి. ఈ ఫ్లయింగ్ ఫాక్స్ రకం గబ్బిలాలు మలేషియాలోనూ, ఆసియా ఖండంలోని కొన్ని ప్రాంతాలలోనూ, పసిఫిక్ మహాసముద్రం, హిందూ మహాసముద్రంలోని ద్వీపాల లోనూ ఎక్కువగా కనిపిస్తాయి. 

## మామయ్య బాలల మాస పత్రిక చందా వివరాలు

వార్షిక చందా పోస్టు లేదా ఏజెంటు ద్వారా రు. 120/-

విడి ప్రతి వెల రు. 10/-

మనీ అర్డరు లేదా డిడి ద్వారా వార్షిక చందాను మేనేజర్ పేర పంపాలి

ఏజెన్సీ ఏర్పాటుకు మేనేజర్‌ను సంప్రదించాలి

చిరునామా
మేనేజర్, మామయ్య బాలల మాసపత్రిక
1-1-187/1/2, వివేక్‌నగర్, చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020,
ఫోన్ : 040-27620887, ఎడిటర్ సెల్ : 94900 98903

Edited, Printed, Published & Owned by Dr. A. Prasad Rao, H.No. 1-9-312/3/G1, Vidyanagar, Hyderabad - 500 044, AP. Printed at Prajasakti Daily Printing Press, 1-1-60/2, RTC 'X' Roads, Hyderabad - 500 020, AP. Published at H.No. 1-1-187/1/2, Viveknagar, Chikkadapally, Hyderabad-500020, AP. **Editor: Dr. A. Prasad Rao**

# మామయ్య పత్రిక రచయితలకు సూచనలు

- ప్రతి రచనా మానవతా విలువలను పెంచేదిగా ఉండాలి.
- బాలలకు సులభంగా అర్థమయ్యేలా సరళమైన భాషను తమ రచనలో ఉపయోగించాలి.
- మూఢనమ్మకాలను ప్రోత్సహించేవిగా రచనలు ఉండరాదు. అలాగే హింసను ప్రేరేపించేవిగా ఉండరాదు.
- వినోదంతో పాటు విజ్ఞానాన్ని అందించే విధంగానూ,బాలల్లో సృజనాత్మకతకు దోహదం చేసే విధంగానూ రచనలు ఉండాలి.
- హాస్యం మేళవింపు రచనకు మరింత ప్రయోజన కరం
- కుల, మత, ప్రాంత సంకుచిత భావాలకు అతీతంగా రచనలు విశాల దృక్పథంతో కూడినవై ఉండాలి.
- బాలలకు ప్రయోజనం కలిగించేవి, సబోధకంగా ఉన్నవి, అన్ని రకాల ప్రక్రియల్లో ఉన్న రచనలు పరిశీలించబడును
- చక్కటి అంశాలతో, వినూతనంగా ఉన్న రచనలకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడును.
- అవసరమైన స్వల్ప మార్పులు చేసే అవకాశం ఉంది.
- పంపే రచన తమదేనని, ఇంతకు ముందు ప్రచురింపబడలేదని, ఇతర ఏ పత్రికకూ ప్రచురణ కొరకు పంపలేదని ధృవీకరణ పత్రం రచనతో పాటు విధిగా పంపాలి.
- రచనల ఎంపికకు బాలల ప్రయోజనమే ప్రాతిపదిక. ప్రచురణకు అంగీకరించిన తరువాత సమయం పట్టవచ్చు.
- ప్రచురించడానికి స్వీకరించని రచనలు తిప్పి పంపబడవు. ఒకవేళ తిప్పి పంపాలని కోరుకుంటే, తగిన స్టాంపులు అంటించి, చిరునామా రాసిన కవరును జతపరచవలెను.
- పాటలు/గేయాలు నేరుగా బాలలు పాడుకునే విధంగా ఉండాలి.
- నేరుగా బాలలకు ఉద్దేశించిన రచన బొమ్మతో సహా ప్రింటులో ఒకపేజీ ఉంటే మంచిది. రెండు పేజీలకు మించరాదు. చెప్పదలచుకున్నది నేరుగా,సూటిగా ఉండాలి.
- బాలల మంచి చెడ్డల విషయంలో వారి తల్లితండ్రులకు, ఇతర పెద్దలకు ఉద్దేశించిన రచనలు కూడా పంపవచ్చును.
- స్వయంగా బాలలు చేసిన రచనలకు ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. ఇందుకు వారిని ప్రోత్సహించి పంపించాలి.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM09A108 |
| పుస్తకం పేరు | మామయ్య |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |